# శ్రీ

# గోకులాభ్యుదయము



గ్రంథ కర్త

బొడ్డుబోయిన వేంకటనారాయణ

శ్రీ గోకులాభ్యుదయము



This book is Published by
with the Financial Assistance of
**'Tirumala Tirupati Devastanams'**
under there scheme aid
to publish reliaious books

# గోకులాభ్యుదయము



**దంపతులు**

**శ్రీ బొడ్డుబోయిన వేంకటనారాయణ**, బి.ఎ.బి.ఇడి.,

జననం : **1-7-1938**

**సౌభాగ్యవతి శ్రీమతి రామసుబ్బమ్మ**

జననం : **25-5-1945**

## అంకిత శ్రీ





# శ్రీ గుండాల కోనేశ్వర స్వామి వారు

గుండాలకోన

# పీఠిక

**శ్రీలలితకళానిధి.**

***విద్వాన్ మైనంపాటి వేంకట సుబ్రహ్మణ్యము***
విశ్రాంత ప్రధానాంధ్రోపాధ్యాయుడు

## అభ్యుదయ రేఖ

1

'దృష్టపూర్వా అపి హ్యర్థాః కావ్యే రస పరిగ్రహాత్,
సర్వే నవా ఇవా భాన్తి మధుమాస ఇవ ద్రుమాః॥'

'ఆనంద వర్ధనుడు'

'' ఇంతకు మునుపు మనం అనేక మార్లు చూచిన పదార్థాలే కావ్యమున రసయుక్తములైనపుడు – ఆమని వేళచెట్లవలె అన్నియు క్రొత్తవైనట్లు తోచును.''

ఈ రచన పురాణ, చారిత్రక విషయ ప్రధానంగా ఉంది.

పౌరాణికంగాకాక చారిత్రకంగా మహాప్రసిద్ధి నొంది

హైందవ ధర్మసంస్కృతికి ఆలవాలమై భారత దేశంలో వెలసిన అలనాటి వంశాలు రెండే రెండు!

రఘుకులము.– గోకులము!

ఆవంశాల్లో ఎందరో మహానుభావులు!

వారి వంశాభ్యుదయ చరిత్రలు మనకు నిత్యసత్యాలు!

ఆదర్శాలు! ఆదరణీయాలు! ఆచరణీయాలు!

ఆ చరితలు ఎవరెవరెన్ని విధాలుగా ఏఏ కవితా రీతుల్లో స్పందించి రచించినా, అ జ్ఞానపీఠికలు అవశ్య పఠనీయాలు! ధర్మానుసరణీయాలు! మానవాభ్యుదయ మార్గ దర్శకాలు!

అందుకే –

ఈ 'గోకులాభ్యుదయం' రచన సాహితీ రసజ్ఞుల హృదయ కమలంగా భాసిల్ల గలదని– నా విశ్వాసం!

''ఆదిరాజ యశోబిమ్బ మాదర్శం ప్రాప్య వాఙ్మయం।
తేషా మసన్నిధానేఽపి నస్వయం పశ్య నశ్యతి''॥

'దండి'

‘ తొంటి రాజుల యశః ప్రతికృతి వాఙ్మయముగు లేక కావ్యరూపమగు అద్దమును బొంది, వారు ఎదుట లేకున్నా తాను మాయమైపోకుండా అగుపడుచునే యున్నది చూడుడు’

ఇది ‘గోకులాభ్యుదయము’- కవిప్రబంధమన్నాడు. ప్రబంధకల్పనా కథా అనిగదా లక్షణం. ఇందు కల్పనా కదలేదు. శ్రీకృష్ణ వంశచరిత కావున పురాణమే సర్గ ప్రతి సర్గశ్చ వంశో మన్వంతరాణిచ వంశానుచరితం చేతి లక్షణానాంతు పంచకం. అని పురాణ నిర్వచనం.

శ్రీ కృష్ణభగవాన్ చరితను వర్ణించిన భారత – భాగవత హరి వంశపురాణాదులు, కావ్యాలు ఈ రచనమునకు ఆధారాలు. ఈ కవి సహజంగా కృష్ణ చరితాభిమాని, గోకులుడు, శివభక్తుడు, మట్లి రాజు వారి సీమలో శ్రీశేషాచల పంక్తుల్లో మట్లిరాజు లేలిన ఎర్రగుంట కోటకు దక్షిణంగా సుమారు 12 కిలో మీటర్ల దూరంలో నెలకొన్న గుండాల ఏరు జన్మస్థానమున ఏడు నీటిగుండాలు గల లోయపాయలో కొండ దరి పేటు ఆలయంగా వెలసిన నిలయంలో సహజోద్భవమైన శివలింగముంది. అది అగస్త్య ప్రతిష్ఠమని తద్విషయం ఆలింగము వెనుకపేటురాతిపై శాసనం లిఖించబడినవని ఆస్వామివారి అర్చకులు కీ.శే. శ్రీ శేషా చలయ్యగారు ( ఎర్రగుంటకోట ) ఒకప్పుడు ఆదైవ దర్శన సమయంలో నాకు తెల్పినారు. ఇటీవల వారిదత్త పుత్రులు శ్రీ రామమూర్తి గారి కాలంలో ఆ స్వామి భక్తుడు శ్రీ సుంకేశుల గంగరౌతు గారి కృషిప్రజాసహకారమువల్ల రాక పోకలకు దారి ఆపేటు నిలయాన్ని దేవాలయంగా మార్చి నిర్మించడంలో ఆశాసనం సిమ్మెంటు పూతలో మరుగుపడింది. ఆ ఆలయానికి దక్షిణపార్శ్వమున నున్న గుహలో శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యుని పెద్దకుమారుడు పెదతిరుమలా చార్యులు భక్తాంజనేయ విగ్రహ ప్రతిష్ఠచేసి దానికెదురుగా పేటు రాతిపై శాసనము చెక్కించినారు ఆతడే ఎర్రగుంట కోట రాజధానికి తూర్పున ఏటి ఒడ్డున శ్రీచెన్న కేశవాలయం నిర్మింపజేసి కోనేరుత్రవ్వించినాడు. ఆయనకానాటి మట్లి ప్రభువుల ఆదరణమున్నది. వారినుండి భూమినిపొంది బ్రాహ్మణ అగ్రహారం ఏర్పరచినాడని చరిత్ర.

ఈ కవి ఆ గుండాలేశ్వర కరుణా కటాక్షాలతో తనకు కవితా భాగ్యం లభ్యమైందని ఆశ్వాసాంత గద్యలో పేర్కొన్నాడు. తాను శ్రీకృష్ణదేవుని గోకుల వంశసంజాతుడైనందున సహజంగా తనవారి వంశశోభ కొంతైనా లోకంలో నిలవాలనీ ఈతని ఆకాంక్ష ఈ రచనమైంది. తన కృషిలో లభించినంత చరిత ఆద్యంతములు తెలియనెంచి ప్రయత్నించి,తెలిసినది సంప్రదాయ పద్యరూపంలో నిబధించినాడు. మన తెలుగు సంప్రదాయ కవితా సంశ్రయమగు అపూర్వరచనమిది. పద్యరచన పరనాదులపై నేటిసాహిత్యసమాజానికి ఆసక్తిలో అలసత్వ మేర్పడింది. కృషి సన్నగిల్లింది. పద్యరచన ఛంద శ్శాస్త్రంలో బిగియవలె. అందుకు శబ్దసౌష్ఠవం, పదసంపద, శాస్త్ర పరిజ్ఞానం, పద్యానికైనా, గద్యానికైనా, గేయానికైనా అవసరం. శ్రమతో అభ్యసించాలి రసవిన్యాసం తెలిసి భావబలమెలయించాలి. రమణీయార్థప్రతి పాదితంగా సాగవలెరచన. మరీనాడు తదావలంబనీయు లెందరు? కొందరు కలరు మహనీయులు. వారివల్ల పద్యరచన జీవించి ఉంది. ఈ చిన్న ప్రబంధాన్ని సంగ్రధించుకొన్న ఈ కవి కుమారుని సాహసం మెచ్చదగింది.

ఈ కవికుమారునికి వారసత్వంగా తాత తండ్రుల నుండి పరంపరా గతంగా లభ్యమైన సాహిత్య సంపద వుంది తాత నాగయ్య, తండ్రి గోపాలయ్య డిగ్రీలు కోరని చదువుతో ‘సర్టిఫికేట్టు’లు లేని విద్యావైదుష్యంతో, బిరుదుల్లేని పాండిత్య వైభవంతో- సన్మానాలు

పొందింపలేని వీధి బడిలో ఉపాధ్యాయులుగా, ప్రజాభిమానమే విద్యాధనంగా శిష్యుల నెందరనో మన ప్రాచీన విద్యాసముపార్జనో న్ముఖులుగానొనర్చిన సద్గురువులు. వారు తమపాండిత్య ప్రకర్షను దండోరావేసి ప్రకటించుకోలేదు. వ్యవసాయక్షేత్ర జీవనమే ప్రధానంగా స్వీకరించినిరాడం బరంగా బ్రతుకుసాగించిన పోతన కవి వారసులు సద్గుణ సంపన్నులు. పోతన భక్తితో భాగవతం తెలుగులో తీర్చాడు వారుబ్రతుకు భాగవతం దిద్దుకోడంలో జీవితం సరిపెట్టుకొన్నారు. పోతనది కనబడే అక్షర రచనం- ఈ అబ్బాకొడుకులది కనబడని బ్రతుకు జీవన వచనం

అమరాది నిఘంటువులు రామాయణ భారత, భాగవతాది పురాణకావ్య ప్రబంధ ముల సాహితీనాట్యవిలాసమునకు వారి రసనాగ్రమే రంగస్థలియనవచ్చు. వారి వంశాంకురమైన ఈ కవి కుమారునికి బడిపంతుల ఉద్యోగము సారస్వత ప్రీతి యబ్బుట వింత కాదుగదా! ఇతనితొలి రచన '' గుండాల కోనేశ్వర శతకము'' ఆదేవునికే అంకితము.

## 3

ఈ గోకులాభ్యుదయం మూడాశ్వాసముల రచన. ప్రధానంగా శ్రీకృష్ణ జన్మ పూర్వచరిత్రమొదలు భారత చరిత్రాంతర యాదవ వంశ పుంగవులు మహారాజులు, వారి రాజ్యప్ర యోజనకర కీర్తి పతిష్ఠలు వివరిస్తుందీ కావ్యం. అంతర్భాగంగా శ్రీకృష్ణచరితలోని ముఖ్యఘట్టాల కథాంశములు సంక్షేపశైలిలో తెల్పబడినవి. భాగవత కథాగమ నము వతెనే పరీక్షన్నరేంద్రునకు శ్రీ శుకయోగి వచించినట్లుగా యయాతి కథతో తొలి ఆశ్వాసము ప్రారంభమవుతుంది.

చంద్రవంశీయులైన రాజచరిత్రములకు భారత భాగవతాలలో ప్రాముఖ్యమున్నది. యయాతి కొడుకు యదువు వంశచరిత్ర తద్వంశీయులైన పుడమీశులవివరణసంగ్రహమున్నది. అందు వసుదేవుని వంశంలోని కుంతీ చరిత్ర ఒక ఆఖ్యాయిక. శ్రీకృష్ణ జననం, లీలలు, ఒక్కోఘట్టంగా తీర్చబడింది.యదువంశవిశేషములేగాక యందు విష్ణుకథా మహాత్మ్యములు చోటుచేసుకొన్నవి. భాగవత దశమస్కంధము సంపూర్ణ శ్రీకృష్ణ లీలా చరిత్రగదా! ద్వాపరయుగాంతరంలో యాదవవంశవిస్తారము. కృష్ణనిర్యాణానంతరం కలియుగప్రవేశము నుండి అదెట్లు వృద్ధినొందెనో మున్నగు ముఖ్యంశాలతో క్రీస్తుశకారంభ పూర్వాపర్వముల స్థితి తెలిసినది, తెలిసి అందుకొన్నది చరిత్ర పుటల్లో చాల తక్కువ యనవచ్చు

క్రీ. శ॥ శతాబ్దుల నుండి 14 శతాబ్దివరకు వర్ధిల్లిన యదువంశ మాన్య రాజన్యుల కీర్తి సౌభాగ్యం ప్రాముఖ్యంసంతరించుకొన్నది. రాష్ట్రకూటుల రాజ్యవిస్తారమున ఖ్యాతిగొన్న ధ్రువప్రహారుడు మొదలు ఢిల్లీ 'ఖిల్జీ' పాదుషా ముఖ్యసేనాని 'ధ్రువప్రహారు'ని మొదలు ఢిల్లీ 'ఖిల్జీ' పాదుషా ముఖ్యసేనాని 'మాలికాఫర్' జయించిన వీర శంకరదేవు'ని వరకు గల భూపతుల చరిత్రాంశములందు క్రోడీకరింపబండింది. యాదవ రాజులితర భూపతుల చరిత్రాంశములందు క్రోడీకరింప బండింది. యాదవరాజులితర భూపాలకులతో స్నేహవైరం కల్గిన వారైనా తమప్రాధాన్యత నిల్పుకొనుటలో కృతకృత్యులైనారన వచ్చు యాదవరాజ్యాలను చాలవరకు జయించి పాదుషాకు దఖల్పరచిన వాడు 'మాలికాఫరే' నట!.

## 4

సామ్రాజ్యపరి పాలనలో యాదవరాజులు ప్రజాసంక్షేమా భివృద్ధికి పాటుపడుచూ, విద్యావిజ్ఞానములను పోషించినారు. వారిలో కొందరు జైన - బౌద్ధములను అభిమానించారు కాలగతిలో మార్పువచ్చి శైవ వైష్ణవ - ద్వైత విశిష్టముల మతాను యాయులై వానిని శక్తివంచన లేక ఆదరించారు యజ్ఞయాగాదులోనర్చి వేద విద్యాభివృద్ధికి కృషిచేసి పోషించారు దేవుళ్ళకు - బ్రాహ్మణులకు భూములు అగ్రహారాలు ప్రత్యేకించి ఇచ్చారు.

భక్తి జ్ఞానవైరాగ్యాలకు నిలయాలైన భగవదాలయాలనే విద్యావినోదాలకు ఆలయాలుగా, ఆశ్రమాలుగానెలకొల్పి సంస్కృత, ప్రాకృత ప్రాంతీయ భాషాపోషకులై ప్రజాహితైక పారాయణులైన రాజలెందరో ఉన్నారు యాదవ రాజుల ఏలుబడిలోని మహారాష్ట్ర కవి 'ముకుంద రాయడు' మరాఠీ భాషలో 'చతుర్వర్గచూడామణి' 'దానకావ్యావళి' వ్రాసెనట - జ్ఞానదేవుడు 'జ్ఞానేశ్వరీ' రచన సంతరించాడు - తన మాతృభాషలో భక్తి జ్ఞానవైరాగ్య గీతాదులను వ్రాసి దైవ చింతనలో దివంగతుడై తనరచనల్లో చిరంజీవిగాను న్నాడు. వారెందరో, స్వయానా ప్రతి భావంతులై గ్రందాలు వ్రాసి వ్రాయించిన రాణ్మహనీయులున్నారు.

క్రీ.శ॥ 12 శతాబ్దిలో ఉత్కళ ప్రాంతీయ పాలకులైన నృపకామాది యాదవరాజులు హొయసలన్న పేరున పేరొందిరి దక్షిణ భారతావని పాలకులగు, చోళ, పాండ్యులను జయించిరి చోళరాజు తన కూతురుని హొయసల ప్రభులతో ఖ్యాతినొందు వీరభల్లాలున కిచ్చి వారితో సంబంధ బాంధవ్యము నెరపినాడట ! దక్షిణభారతావనిలో జరిగిన ఆనాటి యుద్ధరంగాల్లో పాల్గొని విజయలక్ష్మిని కైవసం చేసి కొన్న యదుసింహులైనరాజన్యులున్నారని చరిత్ర వీరు కల్యాణచాళుక్య రాజ్యపద్ధతిని ప్రజారంజకంగాదేశాన్నిపాలించిరి కొందరు రామానుజమతాభిమానులై వైష్ణవులనబడిరి వీరు రాజ్యపాలన, విద్యావైదుష్యమున, వ్యవసాయ, పరిశ్రమాదులందును కళారంగ ములందును అభ్యుదయ పథమున సాగిరనుటలో సందియంలేదు వైదిక ధర్మాభిరతిని పాటించిరి. యాజ్ఞయాగాదులు దేవాలయారామ తటాకొద్యాన నిర్మాణములొనర్చి, లలితకళారాధకులైరి మహావిజ్ఞాన సంపన్నులైన పండితులను, కవులను కళావేత్తలను పోషించి పాలించిన వారెందరో యాదవరాజులు!

## 5

ఏలనాటికదన కిశోరం, బాలచంద్రుడు - విజయనగరాంధ్ర ప్రభువు కృష్ణదేవరాయలు యాదవరాజవంశీయులని పేర్కొనుట చారిత్రక జ్ఞులను ఆలోచింప జేసెవిషయం! లావుకజ్జులోవంపు తెలియరాదన్నట్టు రాజ్యప్రాభవముగల మహారాజులసంబంధ బాంధవ్యములలో వంశాదివిచారణలుండవు. వీర పరాక్రమాతి శయమ్ములే అందు ప్రధానాదేయములగును. రాజన్యులేగాక సామాన్య ప్రజావళిలో సంగీత సాహిత్య సంపన్నులు, వణిక్ప్రముఖులు విజ్ఞానులు, భక్తులు, మహాత్ములు, ప్రజాసేవకులు, తదన్వయమున నెందరో! కదా!

తను పరిశీలించి తెలిసికొన్నంత మాత్రమే చరిత్రను కృతిగా కూర్చి తినని విన్నవించుకొన్నాడీకవి. ఒక చూపులో గోకులోద్యాన మంతా తిరిగి దర్శించడం అసాధ్యం కొంతతన పరి శ్రమలో సాధించినాడనే చెప్పవచ్చు ఈ రచనలో గద్యంలేదు విశేషవృత్తములు చేకొన్నాడు ఇందలి ప్రతి పద్యంహృద్యమే

ఈ గోకులాభ్యుదయ బృందావనంలో రంగురంగుల పూరేకులై వికసించిన వాని చారిత్రక సందర్శనము సుమనోహరము! రసజ్ఞుల హృదయమును చూరగొనగలదని నా విశ్వాసము. ఈ కవి కుమారునికి గోకులానంద మూర్తి శ్రీకృష్ణభగవానుడు చిరాయుష్పంపదలను గ్రహించి మరిన్ని కృతులను గూర్చననుగ్రహించు గాక! యభీష్ట దైవమైన శ్రీ గుండాల కోన పరమేశ్వరుడభీష్ట ఫల ప్రదుడై అభ్యుదయ రేఖాంశువున యశశ్శ్రీ ప్రసాదించుగాక!

*బుధ విధేయుఁడు*

కె. బుడుగుంట పల్లె — **- మైనంపాటి వేంకటసుబ్రహ్మణ్యము.**

రైల్వే-కోడూరు

15-1-1999-బహుధాన్య - సంక్రాంతి.

# అగాధజలనిధిలో ఆణిముత్యం

-డా|| **ముదివేడు ప్రభాకరరావు**, అసిస్టెంట్ ప్రొఫెసర్, ఇన్ తెలుగు.
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధన సంస్థ, తిరుపతి

"పైపయిన్ చదివినవాఁడు పై కివచ్చు
లోతుగాఁజదివినవాఁడు లోనికణగు!
నీట తృణకాష్ఠములు చలియించుచుండు
లోన రత్నాలు మునిగి కూరుకొనిపోవు!!"

ఇది శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యులవారి సుభాషితం! ఆధునిక సామాజిక జీవితానికి అద్దంపట్టే ఈ రుచిరార్థసూక్తి `గోకులాభ్యుదయ' మనే ప్రబంధం వ్రాసిన శ్రీ బి.వి. నారాయణగారికి అక్షరాల అన్వయిస్తుంది. కనీసం ఈయన ఒక పేటికాంతర్గత రత్నమైనా అయివుంటే, అ పెట్టెపై అందంగా చెక్కబడిన నగిషీలు ఆకర్షించి, ఎవరైనా ఆ మూతను హఠాత్తుగా తెరచినప్పుడు జిగేలు మంటూ రత్నపు కాంతులు విరజిమ్మి వుండేవాడు. కాని, ఈయన రాయలసీమ ముగ్గురాళ్లగనుల్లో మగ్గిపోయిన ఒక అజ్ఞాత కవిరత్నం! అగాధజలనిధిలోదాగిన ఆణిముత్యం! మరుగున పడిన మాణిక్యం కావడంచేత కరువులతో కటకటలాడే కడపజిల్లాలోని కుగ్రామంలో ఏండ్లుపూండ్లుగా బడిపంతులుగానే ఉన్నాడు. "న రత్న మన్విష్యతి మృగ్యతే హి తత్" అని కవికులగురువు కాళిదాసు చెప్పినట్లు, రత్నాన్ని మనం వెదుక్కుంటూ పోవాలిగాని అది మనల్ని వెదుక్కుంటూ రాదు! నిజమే ! కాని, కలికాలమహిమ ఎలాంటిదో తెలియదు, మహాకవుల సూక్తులు సైతం మార్చివ్రాయవలసిందే నన్నట్లుగా, ఈ కవిరత్నాన్నివెంటబెట్టుకొని నా చిరకాల వృద్ధ మిత్రులు శ్రీ మైనంపాటి వేంకట సుబ్రమణ్యంగారు ఒకరోజు హడావుడిగా మా యింటికి వచ్చారు. రాగానే ఒక బైండు చేసిన పుస్తకం నా చేతిలో పెట్టి, ``ఇదొక కొత్త ప్రబంధం. మీరీ రచనను సరిచూచి, ప్రెస్సు వర్కులో కూడ సహకరించి, `పీఠిక' వ్రాసి పెట్టాలి సుమా!" అన్నారు. ` మీ పుస్తకానికి నా `పీఠిక' ఏమిటి? ఎవరైనా వింటే నవ్వుతారు' అన్నాను.` ఈ ప్రబంధకర్త నేను కాదు, `ఈయన' అంటూ ప్రక్కనున్న వారి పేరుతో నాకు పరిచయం చేశారు. మసిపాతమానికంలా, ఒక పల్లెటూరి బడిపంతులని చెప్పకనే చెప్పేవారి ఆకార విశేషాన్ని గమనించి, ``వీరిదీ మీ ఊరేనా" అన్నాను.

``అవును మా ఊరికి దగ్గర లక్ష్మీగారిపల్లె" అన్నారు. `సరే, మంచిది' ఈయన కవితగురువు శ్రీమైనంపాటి వేంకట సుబ్రహ్మణ్యంగారట! జగమెఱిగిన బ్రాహ్మణునికి జందెమేల? అన్నట్లు ఈయన అందరితోను కలసిమెలసిపోయే ఉదారస్వభావంగలవాడు. లలితకళానిధి! చారిత్రక పరిశోధకుడు! కవి! విమర్శకుడు! విశేషించి, సహృదయుడు! సజ్జనుడు! ఈయనను చూచినప్పుడంతా నాకు ప్రాచీన కవుల్లో అందరిచేత కవితా వ్యవసాయం చేయించిన పుష్పగిరి తిమ్మనామాత్యుడు, ఆధునికుల్లో అందరి కవిత్వాలకు రూపురేఖల దిద్దిన శ్రీ తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి జ్ఞాపకానికి వస్తారు.

వారిద్దరితర్వాత ముచ్చటగా మూడవస్థానమలంకరించిన ``కవితావ్యవసాయ సంభార దోహదరసావతార సహకారుడు", మైనపుముద్దలాంటి హృదయమార్దవం కల్గిన మా మైనంపాటి సుబ్రహ్మణ్యంగారు! ఈయన కరస్పర్శతో వెన్నముద్దకృష్ణునిపై వ్రాసిన ప్రస్తుత కావ్యము శంఖున బోసిన తీర్థమై"నది! అన్నాను.

ఈ కవి శ్రీగుండాల కోనేశ్వర కరుణా కటాక్షలబ్ధ కవితా విచక్షణుడట! మహా శివభక్తుడట! ఎంత అదృష్టవంతుడు! ఇంతకీ ఈ గుండాలకోన ఎక్కడుంది? అది శైవక్షేత్రమా? అనే ప్రశ్నలకు సమాధానంగా కవి యిష్టదైవం గుండాల కోనేశ్వరుడు కాబట్టి, మనం కొంత పరిశోధన చేసి తెలుసుకోకతప్పదు.

**-3-**

కడపజిల్లా, కోడూరుతాలూకా, చిట్వేలు రహదారిపై నున్న వెంకటరాజుపల్లెకు రెండుమైళ్లలో ఉన్న శైవక్షేత్రం గుండాలకోన. ఇక్కడ గుండాలేశ్వరాలయం ఉంది. దీనిని కర్కాటకక్షేత్రమని కూడ అంటారు. అడవుల మధ్యనున్న ఈ క్షేత్రంలో బంగారు కొండ్లుగల ఎండ్రకాయలు వెలికివచ్చి భక్తులకోర్కెలు తీర్చుతాయని ప్రతీతి. సుమారు 40 అడుగుల ఎత్తుగల జలపాతం నుండి పడే నీరు సమీపంలోని ఎల్లమరాజు చెరువును చేరుతుంది. కార్తీక సోమవారాలలో భక్తులెక్కువగా అక్కడికి వెళుతుంటారు. మట్ల రాజుల కాలంలో వెలసిన ఈ ఆలయానికి ఆ రాజులు కొద్దిపాటి మాన్యాలిచ్చారు.

ఈ తాలుకా చెయ్యేరు పెన్నలో చేరుదాక ఏటిగట్టున ఎన్నో శైవక్షేత్రాలున్నాయి.

a) వాటిపల్లె, మండపల్లె వద్ద పాలేశ్వరం
b) చొప్పావారి పల్లెలో కణ్ణేశ్వరం
c) గుండ్లూరు వద్ద భీమేశ్వరం
d) కుమారానంత రాజపురం వద్ద నాగేశ్వరం

e) తిరువణం పల్లెవద్ద స్నేహేశ్వరం

f) లేబాక వద్ద ఖరేశ్వరం

ప్రధానంగా పేర్కొనదగినవి. సింగనమలలో వామనమూర్తి ఆలయం, గురునాథేశ్వరాలయం ఉన్నాయి.

మట్లిరాజుల కాలంలో ఎఱ్ఱగుంట్లలో ప్రధానమైన కోట ఉండేది. ఈ నాటికీ కోటి బురుజులు, ద్వారాలు శిథిలమైనా భద్రంగా ఉన్నాయి. కోటిలో ఆంజనేయాలయం ఉంది. ఎఱ్ఱగుంట్ల కోటకు దక్షిణంగా సమారు ఏడుమైళ్లలోగల శేషాచలపర్వతంలో నీలకంఠేశ్వరస్వామి ఆలయం ఉంది. దానిప్రక్కన దక్షిణం వైపున గుహలో శ్రీ తాళ్లపాక పెదతిరుమలాచార్యులు ప్రతిష్ఠించిన హనుమంతుని విగ్రహం ఉంది. దానికెదురుగా గుహపేటి శిలపై శాసనముంది. జలపాతానికి పోయేదారి పొడవునా అక్కడక్కడ ఆ పేటుపై పెద తిరుమలాచార్యుల వెంటనున్న పరివారము, వారిపేర్లు చెక్కబడినవి. సుబ్రహ్మణ్యస్వామి ఆలయం కూడ ఉంది. ఈ ప్రాంతాన్ని గుండాలకోన అంటారు.[1]

గుండాలకోన ప్రాచీనకాలం నుండి శైవక్షేత్రమైనా, విజయనగరసామ్రాజ్యకాలంలో ముఖ్యంగా, అరవీడు రాజులు, వారికి సామంతులైన కడపజిల్లా, సిద్ధవటం పరిపాలకులైన మట్లిరాజుల కాలంలో వైష్ణవ దేవతాప్రతిష్ఠలను కూడ సంతరించుకొన్నట్లు చారిత్రకాధారాలవల్ల తెలుస్తున్నది.

మట్లి రాజులు ముఖ్యంగా మట్లి కుమార అనంతరాజు (క్రీ.శ.1570-1600) శైవ, వైష్ణవ తారతమ్యం లేకుండా సమానంగా గుడిగోపురమంటప ప్రాకారాదులకు దానధర్మాలు చేశాడు2. ఇతడే కకుత్స్థవిజయ మనే ప్రబంధకర్త. మట్లికుమార అనంతరాజు సిద్ధవటంలో చెన్నకేశవస్వామికి దేవాలయాన్ని కట్టించి, ప్రాకార గోపురాలతో ఆభరణాలను కూడ సమర్పించాడు (పుట-282). పుష్పగిరిలో చెన్నకేశవస్వామి ఉత్సవాలు ప్రతియేటా జరుగుతాయని కడపజిల్లా గెజిటీయర్ (1967, పుటలు 747-748) లో పేర్కొనబడింది. గుడి లేకుండ ఉత్సవాలు జరిగే అవకాశం లేదుకదా!

కడపజిల్లా కమలాపురం తాలూకా, ఎఱ్ఱగుడి పాడులో చెన్నకేశవదేవాలయం ఉంది. ఇది కమలాపురానికి పశ్చిమదిశలో నాల్గు మైళ్ళదూరంలో ఉంది. ఈ

---

1. కడప సంస్కృతి-దర్శనీయస్థలాలు-జామద్ది హనుమచ్ఛాస్త్రి 1981, పుటలు 59-60
2. TIRUPATI SRI VENKATESVARA - Sadhu Subrahmanya Sastri, T.T.D., Tirupati, 1981, Pages. 281-284.

దేవాలయంలో ఎన్నో శాసనాలున్నాయి. అందులో ఒక శాసనం క్రీ.శ. 7వ శతాబ్దానికి చెందిన ఎజికల్ ముత్తరాజు వేయించినది. సదాశివరాయల కాలానికి సంబంధించిన శాసనాలు నాల్గు ఉన్నాయి. (క్రీ.శ. 1543, 1547, 1549, 1551).

కడపజిల్లా, రాజంపేట తాలుకా, ఎఱ్ఱగుంట్ల కోట మట్లిరాజుల మూలస్థావరం. ఇది అనంతరాజుపేటకు పశ్చిమ దక్షిణ విభాగంలో మూడు మైళ్లదూరంలో ఉంది. అనంతరాజు పేరు మీదుగా ఏర్పడిందేనని చెప్పాలి.[1]

మట్లిరాజులకు పూర్వమే రాజంపేట తాలుకాలోని, తాళ్లపాక గ్రామంలో చెన్నకేశవదేవాలయం ఉన్నట్లు తాళ్లపాక చిన తిరువేంగళనాధుని అన్నమాచార్య చరిత్ర ద్విపదకావ్యం వలన తెలుస్తున్నది. అన్నమయ్య తండ్రి నారాయణయ్య చదువురాలేదనే చింతతో చింతలమ్మగుడిలోని పుట్టలో చేయిపెట్టగా ఆ దేవత కరుణించి-- ``కేశవుండా శ్రిత క్లేశనాశకుఁడు

మీ తాళ్లపాకలో మెఱయుచునుండు
నా తామరసనేత్ర నాలయంబునకు
వలసుట్టి మ్రొక్కు మవ్వలవాని కరుణ
నలరుచు సకల విద్యలు నీకు వచ్చు."

నన్నది. ఆ ప్రకారమే నారాయణయ్య తాళ్లపాకలో వెలసిన జాతరూపాంశు కేశవుఁగాంచి మ్రొక్కి" అభీష్టసిద్ధి పొందాడు.

శ్రీ మద్రామానుజుల సమకాలంలోనే (క్రీ.శ. 1017-1137) ఆంధ్ర, కర్ణాటక రాష్ట్రాలలో చెన్నకేశవదేవాలయాలు, నృసింహాలయాలు ఎన్నో వెలిశాయి. ఆవిధంగా గుండాల కోనలో కూడ చెన్నకేశవుని ప్రతిష్ఠ జరిగివుంటుంది. ఈ గుండాలకోన ఒక శైవ-వైష్ణవ దేవతల సంగమస్థానంగా అభివర్ణించవచ్చు.

ఇదంతా ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే, ``గుండాలాధిప చెన్నకేశవహరీ! గోవర్ధనోద్దారకా!" అనే శార్దూల వృత్తమకుటంతో 55 పద్యాలు మాత్రమే లభిస్తున్న శతకం కాగితపు ప్రతి (stock no R 128 E) శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధనసంస్థ గ్రంథాలయంలోను, D 1519, D 1541 అనే సంఖ్యలుగల రెండు తాళపత్రప్రతులు మద్రాసు ప్రభుత్వప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారం లోను ఉన్నాయి[1].

---

1. Andhra Pradesh District Gazetteers (Cuddapah) Ed., Bh. Sıbasankaranarayana, Hyderabad 1967, Page, 747-748

1. A Descriptive Catalague or Telugu Mannscripts, G.O.M.L., Madras, Voe Vii (Satakas) 1939, pages. 1833-1834.

గుండాల చెన్నకేశవశతకంలోని పద్యాలు మచ్చుకు రెండు -

శా॥ దండం బంబుధి కన్యకాధవునకున్ దైత్యారికిన్ శౌరికిన్
దండం బభ్రగ రాజవాహనునకున్ దాక్షాయణీశ స్తుతా
ఖండ ప్రాభవ శాలికిన్ సకలలోకస్వామికిన్ నీ కహో
గుండాలాధిప చెన్నకేశవహరీ! గోవర్ధనోద్ధారకా!

శా॥ మండాటం బిక నన్యదైవతములతో మాకేల చాలుంబ్రప
న్నుండన్ నే నినుఁజూచినన్ దిరువతుల్ నూటెన్మిదిం జూచిన
ట్లుండెన్ నేఁడెటువంటి పుణ్యదివసంబో, యెంత ధన్యుండనో
గుండాలాధిప చెన్నకేశవహరీ! గోవర్ధనోద్ధరకా!

"ఈ శతకం లోకనీతితో కూడిన కేశవ స్తుత్యాత్మకం. గ్రంథకర్త ఎవరో తెలియడం లేదు. గుంటూరు మండలమునగల గుండాల గ్రామమున వెలసిన చెన్నకేశవస్వామి యాత్రోత్సవ మొకప్పుడు కవి దర్శించియప్పుడే యీ శతకాన్ని రచించినాడు" అని పై క్యాటలాగు తయారుచేసిన వివరణకర్తలు వ్రాసినారు. గుంటూరుజిల్లా గెజిటీయర్ పరిశీలంచగా "గుండ్లకమ్మ" అనే నది కర్నూల్ జిల్లా లోని గుండ్లబ్రహ్మేశ్వరం వద్ద పుట్టి, కంభంలో ప్రవేశించిన చోట ఒక ఆనకట్ట కట్టబడిందని, విజయనగరరాజులకాలంలో కట్టబడిన దాని "కంభం చెఱువు" అంటారని తెలియజేయబడింది. "1అంతే తప్ప 'గుండాలకోన' అనేపేరు గుంటూరు జిల్లాలో ఉన్నట్లు చెప్పబడలేదు. ఒకవేళ అన్నా ఈ శతకం కడపజిల్లాకు చెందిన గుండాల కోనకు చెందినదే నని చెప్పవలసి ఉంటుంది. ఎందుకంటే -

'గుండాల' అనేది నీరుగల శైవ, వైష్ణవ క్షేత్రాలు కడపజిల్లాలోనే ఎక్కువగా కనబడుతుండడంవలన ఈ గుండాలాధిప చెన్నకేశవుడు కడప మండలం వాడేనని. నా అభిప్రాయం. దీనికి ఉపమానంగా, ``కడపజిల్లాలోని పాలకొండల దిగువనగల వంచలింగాల సన్నిధికి ప్రాగ్దక్షిణ దిశలో గుండాల మల్లికార్జునస్వామి దేవాలయమున్నది. ఇక్కడ క్రీ.శ. 1441, 1442 ప్రాంతాలలో వేయబడిన శాసనాలున్నాయి. ఈ మల్లికార్జునుని సేవించుకోవడానికి భక్తులు, అక్టోబర్-నవంబర్ మాసాలలోని కార్తీక సోమవారాలలో తండోపదండాలుగా వస్తుంటారు.' అని కడపజిల్లా గెజిటీయర్ (పుట747) తెల్పుతోంది.

లౌకిక నీతులు గల గుండాలాధిప చెన్నకేశవశతకం, తాళ్లపాక పెద తిరుమలాచార్యుల నీతిసీస పద్యశతక ప్రభావంతో ఆయన తర్వాతే వ్రాయబడివుంటుందని నేను భావిస్తున్నాను.

---

1. Andhra Pradesh District Gazettes (Guntur) Govt of A.P., Hyderabad, 1977, P-7

కడప మండల కవియైన శ్రీనారు నాగనార్యగారు "కలిమలవినాశ!" గతపాశ! కర్కటేశ! అనే మకుటంతో గుండాలకోనేశ్వరుని మీద ఒక శతకం వ్రాసినట్లు శ్రీ జానమద్దివారు తెల్పుతున్నారు. మచ్చుకు ఒకపద్యం-

కొండపైనిల్లు, కొడుకంటి కొమ్ము వాఁడు
పునుకలో దిండి, పాములు భూషణములు
కాటిలోనుండి నీవునన్ గావగలవె?
కలిమల వినాశ! గతపాశ! కర్కటేశ!

అంతెందుకు? ప్రస్తుత కావ్యకర్త బి.వి.నారాయణగారు కూడ గుండాల కోనేశ్వర శతకం వ్రాశారు.

మట్లిరాజులకు పూర్వమే తాళ్లపాక అన్నమాచార్యులకుమారుడు పెదతిరుమలాచార్యులు (క్రీ.శ.1460-1554)గుండాలకోనలో హనుమంతుని విగ్రహం ప్రతిష్ఠించినట్లు జానమద్దివారు1ఓరుగంటి సీతరామమ్మగారు వ్రాస్తున్నారు.2ఈ విషయాన్ని శ్రీ మైనంపాటి వేంకట సుబ్రహ్మణ్యంగారే మొట్టమొదట తెలియజేశారు.(చూడుడు ప్రస్తుత కావ్యానికి వారి అభ్యుదయ రేఖ)

గోకులాభ్యుదయ ప్రబంధకర్త శ్రీనారాయణకవి ఎంతటి శివభక్తుడైనప్పటికీ ఆయన ప్రబంధకథా ప్రధాన నాయకుడు గోకులోద్ధారకుడైన శ్రీ కృష్ణుడు! ఈ దృష్టితో పర్యాలోచించినప్పుడు ఈయన ప్రాచీన కవి పోకడలు పుణికి పుచ్చుకొన్నవాడని తెలుస్తుంది. పోతన అద్వైతి శివభక్తుడు. వ్రాసినది విష్ణుభక్తి ప్రతిపాదకమైన మహాభాగవతపురాణము. ఆధునికుల్లో యిటువంటివారు లేకపోలేదు. విశ్వనాథ అద్వైతి. శివభక్తుడు. వ్రాసినది, రామభక్తి సామ్రాజ్యమైన రామాయణ కల్పవృక్షము. దీనిచే ఈ కవి శివకేశవభేదం లేని అద్వైత తత్త్వం జీర్ణించుకొన్నవాడని తెలుస్తుంది.

- 4 -

రాయలసీమ ఎంతటి కరువుకాటకాలతో కొట్టుమిట్టాడినా, కవులకేమాత్రం గొడ్డుబోలేదని, బొడ్డూడని పసికూనలు సైతం అవధాన విద్యలో అంతర్జాతీయ ఖ్యాతి గడించారని చెప్పడానికా అన్నట్లు, కడపమండల వాసియైన ఈ బొడ్డుబోయిన వేంకటనారాయణకవి గోకులాభ్యుదయమనే చంద్రవంశ యదువంశజుల పురాణకథను ఆధునిక కాలాలవరకు, అంటే కలియుగ రాజవంశావళి వరకు తెచ్చి ప్రబంధంగా వర్ణించి కృతకృత్యులయ్యారు.

---

1. కడప సంస్కృతి - దర్శనీయ స్థలాలు - జానమద్ది హనుమచ్ఛాస్త్రి 1981, పుటలు 59-60
2 తాళ్లపాక పెదతిరుమలయ్య కృతుల లిమర్శక పరిశీలన -ఓరుగంటి సీతారామమ్మ 1985 పుట-15

కడపమండల కవుల అభిరుచులు ఎంత విచిత్రమైనవోగాని, కడపజిల్లా, రాయచోటి తాలుకాలోని దోనంవారిపల్లె వాస్తవ్యుడైన దోనూరు కోనేరు నాథకవి (క్రీ.శ.1500-1580) ఆరవీటి రాజుల ఆస్థానకవిగా కడపజిల్లా, కమలాపురం తాలూకాలోని `ఎఱ్ఱగుంట్ల" గ్రామాన్ని, అదే తాలూకాలోని `నిడుజువ్వి"ని అగ్రహారాలుగా అవుకు నల తిరుమలరాజుచేత నంద్యాల నరసింహరాజు చేత పొందినట్లు, మెకంజీ లోకల్ రికార్డులలోని 33వ సంపుటం, 244 వ పుటయేగాక, కడపజిల్లా గెజిటీయర్, (1967) కర్నూల్ జిల్లా గెజిటీయర్లు (1974) తెల్పుతున్నాయి. ఈ కవి వ్రాసిన పద్యబాలభాగవతం (1543)1లోను ద్విపద బాలభాగవతం(1547)2 లో -

1. పద్యబాలభాగవతం శ్రీ పంగనామలబాలకృష్ణమూర్తిగారిచే S.V.U. Onimte senior No. 49, 1954 లో తిరుపతి T.T.D వారిచే ప్రచురింపబడింది. దీనిపై డా|| జి.అన్నయ్యనాయుడు పరిశోధించి 1993లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం నుండి డాక్టర్ బూచూరు కుసుమాంబ 1998 లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం నుండి డాక్టర్ డిగ్రీ స్వీకరించారు.

2.ద్విపద బాలభాగవతాన్ని పపరిష్కరించి పరిశోధించి ప్రస్తుత పీఠికాకర్త పర్యవేక్షణలో

కడపజిల్లా కలెక్టరుఅసిస్టెంట్‌గా రిజిష్టార్‌గా 1820; 1826లో పనిచేసిన ఆంధ్రభాషోద్ధారకుడు సి.పి. బ్రౌన్ (1798-1884)పండిత మండలి (బ్రౌన్ కాలేజి)లో ప్రముఖుడైన జూలూరి అప్పయ్య పండితుడు గొప్పవ్యాఖ్యాత, పరిష్కర్త, కవి కూడ. ఈయన వ్రాసిన `యదువంశభూషణ శతకము' ప్రసిద్ధమైనది. ``కృష్ణ! హరీ! యదువంశభూషణా! అనే మకుటం గల ఈ శతకంపై నా పర్యవేక్షణలో కుమారి సి. నాగమణి పరిశోధించి ఎం.ఫి.ల్., డిగ్రీని శ్రీ వేంకటేశ్వర విద్యాలయంనుండి 2000లో గ్రహించింది. పోతన భాగవతం లోని , కుంతీకృత కృష్ణస్తవం లో ``శ్రీ కృష్ణా! యదుభూషణా ! నరసఖా! శృంగార రత్నాకరా!" అనే పద్యం శ్రీ కృష్ణ భక్తులు నిత్యం పారాయణం చేస్తారు. అప్పయ్యగారి శతకమకుటానికీ, నారాయణకవి కావ్యవస్తువుకూ పోతనగారి పద్యమే ప్రేరకం.

పురాణపంచ లక్షణాలలో ఒకటైన వంశవర్ణనలో-

సూర్యవంశము శ్రీరాముడు
చంద్రవంశము పరశురాముడు
పురువంశము పాండవులు
యదువంశము శ్రీకృష్ణుడు

యీ నాల్గు వంశాలను విస్తృతంగా వర్ణించారు. అంతేకాదు

'వంశానుచరితము' అనే పురాణ లక్షణంగా, కలియుగ రాజ వంశ వర్ణన చేశాడు. చంద్రవంశానికి చెందిన కలియుగాది నుండి ఆరవీటి వంశవృక్షంలో చరిత్రకందుతున్న తాత పిన్నమరాజు వరకు గల 45 పురుషాంతరాలను వర్ణించి చరిత్ర సృష్టించిన ధన్య చరిత్రుడు దోను కోనేరునాథ కవి.

గోకులాభ్యుదయ కర్త నారాయణకవి కడవమండలవాసియైన ఈ దోనూరి కోనేరు నాథుని రచనల్ని, ఆయన చేసిన చంద్రవంశవర్ణల్ని చదివాడో లేడో కాని, దాదాపు 500 సంవత్సరాల తర్వాత ఆధునిక యుగంలో పురాణవంశవర్ణనలో ఆధారంగా కావ్య నిర్మాణం చేసిన ఏకైక కవి శ్రీ నారాయణకవియే నని చెప్పక తప్పదు.

దోనూరికవి కంటే ముందుగా పోతన భాగవతం వ్రాశాడు కదా! అందులో రాజవంశ వర్ణనలు లేవా? అని అడుగవచ్చును. ఈ సందర్భంలోమీరు రాజవంశవర్ణనల్ని కూలంకషంగా పరిశీలించి గొప్ప పరిశోధనాత్మక వ్యాసం వ్రాసిన డా|| పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు పోతన రచన గురించి యిట్లభిప్రాయపడినారు "పోతనకు బొత్తిగా చరిత్ర దృష్టి లేదనుటలో అతిశయోక్తి యెంతమాత్రమును లేదు. మూలమునందున్న చరిత్రను విమర్శించుమాట యటుంచి దానిని సరిగ అర్థము చేసికొని తన గ్రంథమున చేర్చుటయందుకూడ కొంత ఔదాసీన్యము కలిగించెనేమో! అందువలననే సంస్కృత భాగవతములనకును పోతన భాగవతమునకును కొన్ని ముఖ్య భేదములు కన్పించుచున్నవి.

సంస్కృతభాగవతాన్ని పరిశీలించి డా||పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు నిర్ణయించిన రాజవంశములిట్లున్నవి.

| | | |
|---|---|---|
| 1)ప్రళయము | దైవస్వత మనువు | క్రీ.పూ.3100 |
| 2) యయాతి యుగము | (చంద్రవంశము) | క్రీ.పూ.3000-2750 |
| 3) మాంధాతయుగము | (సూర్యవంశము) | క్రీ.పూ.2750-2550 |
| 4) పరశురామయుగము | | క్రీ.పూ.2550-2350 |
| 5) రామచంద్రయుగము | (సూర్యవంశము) | క్రీ.పూ. 2350-1950 |
| 6) కృష్ణమహాయుగము | (యాదవవంశము) | క్రీ.పూ.1950-1400 |
| 7) భారతయుద్ధము | (చంద్రవంశము) | క్రీ.పూ. 1400 |
| 8) భారయుద్ధానంతరయుగము | | క్రీ.పూ.1400-600 |
| 9) బౌద్ధయుగము | | క్రీ.పూ.600-క్రీ.శ200 |

వ్యాసాంతములో డా||పుట్టపర్తి యిలా వ్రాశారు. "ఆంధ్రరాజవంశమును గూర్చిన విషయములను గూడ పోతన యెంతమాత్రమును పరిశీలింపక గ్రంథమును రచించెననుట స్పష్టము. చారిత్రక దృష్టి లేకుండుటయే యిందులకు కారణము". (పుట-236) 1

1పోతన భాగవతము- రాజవంశములు-భువనకోశము-ఇతర శాస్త్రములు-డా॥పుట్టపర్తి శ్రీనివాసాచార్యులు ఆంధ్రమహాభాగవతోపన్యాసములు,

పోతన భక్తి రసానికి అగ్రతాంబూలమిచ్చినారు. భక్తిరసం అనేది అన్ని రసాలను విరిచివేయడమే గాక, దేశకాల పాత్రలే పునాదిగా గల చారిత్రకస్పృహను మూలముట్టుగా తుడిచివేస్తుంది. వైయక్తిక స్పృహ. (Personal State) ను తీసివేసి వ్యక్తి రాహిత్యస్థితి (Impersonal State) కి తీసుకుపోవడమే భక్తి రసలక్షణం. అంటే సాహంకార స్థితిని కాదని నిరహంకారస్థితికి చేర్చడం దాని ధ్యేయం. కాని, పురాణంలో ఈ చారిత్రకస్పృహకూడ చాల ముఖ్యం! ఈ విధంగా పోతన వల్ల ఏర్పడిన లోపాన్ని పోగొట్టడానికా అన్నట్లు ఆయన తర్వాత వచ్చిన కడప మండల కవులిద్దరు-దోనూరివారు నారాయణ కవిగారు రాజవంశవర్ణనలు సమృద్ధిగాచేసి ఆ లోటును పూరించినారని ఘంటాపథంగా చెప్పవచ్చును. దోనూరి వారికంటే మరో అడుగుముందుకు వేసి ఆధునిక కాలం వరకు యదువంశవర్ణన చేసిన నారాయణకవి గోకులాభ్యుదయం-ఒక సత్కృతియే కాదు, చారిత్రక భాస్వత్కృతిగా అభివర్ణించవచ్చును.

-5-

# కథాకథనశిల్పం

ఏ కులము మీదంటే గోకులము నవ్వింది!
మాథవుడు యాదవుడు మా కులమే లెమ్మంది!!

అనే వేటూరి సుందరరామమూర్తిగారి పాటలో జీవులందరియొక్క కులం గోకులమేనని, అమాయికులైన గోవులవంటి జీవుల్ని కాపాడి రక్షించేవాడు యదువంశంలో జన్మించిన మాదవుడనీ, ఆ భగవంతుని కులమే అందరిదనీ ధ్వని గర్భితంగా చెప్పబడింది.

"బృందావనమది అందరిదీ, గోవిందుడు అందరివాడేలే" అనే పాటలో కూడ భగవంతుని సన్నిధిలో అందరికీ సమాన అవకాశాలు ఉంటాయనీ, భగవంతుడందరికీ చెందిన ఉమ్మడిసొత్తుగా చెప్పబడింది. ఒక సూర్యుడు సమస్త జీవులకు తానొక్కడై తోచు పోలిక"గా భగవంతుని లక్షణం ఉంటుంది. కాబట్టి గోకులం అంటే యాదవకులం, గొల్లకులం అనిచెప్పవలసిన అవసరం లేదు.

కర్ణాటక దేశంలో గొప్ప వాగ్గేయకారుడైన భక్త పురందరదాసు - ఆడుత్త నీబారో! నాట్యవాడుత బారో! బారో ముద్దుకృష్ణ! మాధవా! బారో ముద్దు కృష్ణ! అనే కీర్తనలో-

ఆంధ్రసారస్వతపరిషత్తు హైదరాబాద్, మూడవ[illegible]పుటలు182-236

గోకులదల్లిహుట్టి గోవుగళనె కాయద దేవ!
గోపీయ జనరిగె తలయ తోరిదదేవ !!

అని అంటాడు. ఓ కృష్ణానీవు గోకులంలో పుట్టి గోవులను కాచిన దేవుడయ్యా! గోపికలకు నీ లీలా వినోదాన్ని ప్రదర్శించినవాడవయ్యా!" అంటాడు. గోవుల్లాంటి అమాయికజీవులకు తన వేణుగానంచే ఆనందాన్ని కల్గించే వాడు గోవిందుడు. శిశువులు, పశువులు, పాములు, సర్వ చరాచరప్రకృతి ఆయన వేణునాదంలో లీనమై రస తన్మయత్వంలో నిమగ్నమైపోతున్నాయి! అతడే గోపాలుడు!గోవిందుడు! గోకులంలోని శ్రీ కృష్ణుడు!

`విజయవిఠల' ముద్ర గల్గిన కీర్తనలోకూడ-``కాయ్ దనో వత్సవాహరి, మొద దించలి మాదవా! కాయ్దనో వత్సవాహం" సంకీర్తించబడింది. గోగోపగోపీజన సంరక్షణ మనగా సృష్టిలోని పశు, మనుషుల్లో స్త్రీ పురుష వివక్ష లేకుండ అందరికీ అందుబాటులో ఆత్మతత్వాన్ని ప్రకాశింపజేసేవాడు గోకులోద్ధారకుడైన గోవిందుడు! అని అర్థం!.

శైవ సిద్ధాంతంలో కూడ జీవులందరు పశువులు. శివుడు పతి వీరిద్దరని కలిపేతత్వం పాశం. కాబట్టి శివునికి `పశుపతి' అనిపేరు. గోవిందుడన్న అర్థమిదే! శివుడు సృష్ట్యాదిలో సముద్ర మధనవేళ పుట్టిన హాలాహాలాన్ని పానం చేసి సృష్టిని రక్షించాడు. పాముల్ని మెడకు చుట్టుకున్నాడు. బాలకృష్ణుడు విషపూరితమైన కాళంగి మడుగులో దూకి కాళీయుని పడగలపై నాట్యమాడడమే కాదు- అరణ్యంలో చెలరేగిన దావానలాన్ని పానంచేసి గోగోపకులనందర్ని రక్షించాడు. కాబట్టి శివకేశవులకు అభేద ప్రతిపత్తి!

గోకులాభ్యుదయమనే ఈ ప్రబంధంలో మూడు అశ్వాసాలున్నాయి. ప్రథమాశ్వాసంలో 164, ద్వితీయాశ్వాసంలో 152, తృతీయాశ్వాసంలో 184 అవతారికలో 20 పద్యాలు వెరసి 520 పద్యాలున్నాయి. ఇదొక నిర్వచన పద్య కావ్యం. తిక్కన గారి నిర్వచనోత్తర రామాయణం దీనికి స్ఫూర్తి కాబోలు!

నారాయణకవి ఈ ప్రబంధంలో కథాకథనం చేస్తూ చెప్పిన కథలు మూడు మాత్రమే!

1. యయాతి కథప్రథమాశ్వాసం 150 పద్యాలు
2. కుంతి కథ ద్వితీయాశ్వాసం 21పద్యాలు
3. కృష్ణ కథ తృతీయాశ్వాసం 78 పద్యాలు

ఇందులో యయాతి కథను మాత్రమే పరిశీలిద్దాం. ఈ కథను ఆదికవినన్నయ ఆంధ్రమహాభారతం ఆదిపర్వం తృతీయాశ్వాసంలో 131 గద్యపద్యాలలో వర్ణించి యున్నాడు. నన్నయ ప్రసన్న కథాకలితార్థయుక్తితో

అత్యద్భుతంగా కథాకథానాన్ని నడిపించినా వ్యాసభారతాన్ని అనుసరించారు. ప్రస్తుతం నారాయణకవి నన్నయగారిని సన్నిహితంగా అనుసరించి నప్పటికీ కథాకథన శిల్పంలో కొన్ని మార్పులు, చేర్పులు చేసి యుండడం ఆయన స్వతంత్ర భావనాసిద్ధికి తార్కాణంగా చెప్పవచ్చు.

యదువంశచరిత్ర పూర్వ యాదవ రాజుల వంశప్రాబల్యాన్ని వర్ణించేది కాబట్టి, నన్నయ కచదేవయానుల కథను 33గద్యపద్యాలలో చెప్పియుండగా, ఈ కథ ప్రస్తుత ప్రధాన కథ కంతగా అవసరం లేకపోయినా కచదేవయానుల పరస్పర శాప ప్రసక్తి అవసరం గనుక, దానికి మాత్రమే ప్రాధాన్యమిస్తూ, ఆరు పద్యాలలో క్లుప్తంగా ముగించడం నారాయణకవి రచనాపాటవానికి మచ్చుతునక! ``అహో సంక్షేపః" అని సంస్కృత నాటకాలలో జరిగిన విస్తృతమైన కథను రెండుముక్కల్లో చెప్పినపుడు ప్రధానపాత్ర ఆశ్చర్యం ప్రకటించేరీతిగా, ఈ కవి ఒక పెద్దకథను ప్రాధాన్య వివక్ష దృష్ట్యా సంగ్రహీకరించి చెప్పడంలో చేయితిరిగినవాడని తెలుస్తున్నది.

రెండవమార్పు- పాడుబడ్డ బావిలో పడిపోయిన దేవయానిని యయాతి దక్షిణ హస్తంతో ఉద్ధరించినపుడు ఆమె `వివస్త్ర'గా ఉండడం వలన ముందుగా తన ఉత్తరీయాన్ని యిచ్చి, ఆ తర్వాత కుడిచేతితో పట్టి పైకిలాగినాడని ఈ కవి వ్రాయడంలో ఔచిత్యం ఎంతైనా కనబడుతుంది. నన్నయ భారతంలో నూతిలో బడిన దేవయాని `వివస్త్ర' యన్న విషయం సూచితం కాలేదు. దేవయాని చీరను శర్మిష్ఠ కట్టుకొన్న దోషంచేత దేవయాని నూతిలో నెట్టివేయబడింది. నిజమే! కాని, ఏ పరిస్థితిలో వున్నపుడది జరిగింది? అనేది ప్రశ్న! సిగ్గుచే హడావుడిగా చీరను చుట్టుకొన్న శర్మిష్టను చూచి కోపోద్రిక్తమైన దేవయాని ఆమెతో అభిజాత్యపు గర్వం ప్రదర్శింపగా, శర్మిష్ట క్షత్రియకన్య కాబట్టి రోషంతో నూతిలో నెట్టివేసింది. ఇది కథాగతికి సహజమైన పరిణామం. నారాయణ కవి ఊహలో సామంజస్యం కనబడుతుంది. నన్నయ గోప్యంగా ఉంచిన దాన్ని నారాయణకవి స్పష్టీకరించి చెప్పాడు.

మూడవమార్పు-అటువంటి దేవయాని, నన్నయకథలో దాసియైన శర్మిష్ఠతో సహస్ర దాసీగణములతో నున్నపుడు రెండవసారి యయాతిని యాదృచ్ఛికంగా కలసినప్పుడు పూర్వపరిచయాన్ని పురస్కరించుకొని తన పాణిగ్రహణం చేసినవాడే తనను పెళ్లాడవలెనని చెప్పడం, యయాతి అది ధర్మవిరుద్ధమని వారించగా ఆయనతో ఈమె ధార్మిక విషయాలు వాదించడం - ఒక కన్యకుండే పరిమితుల దృష్ట్యా అనౌచిత్యమని, స్త్రీ సహజమైన మితభాషిత్వానికి, మనః ప్రవృత్తికి విరుద్ధమని కాబోలు. - నారాయణకవి, దేవయాని తన తండ్రియైన శుక్రాచార్యునికి అభీష్టం తెలుపగా, ఆయన యయాతిని రప్పించి, వివాహానికి

ఒప్పించి వారికి పెండ్లిచేయడం-ఎంతో ఔచితీవంతమైన మార్పుగా చెప్పాలి. ఆధునిక కాలంలో తల్లితండ్రులకు తెలియకుండా వివాహాలు చేసుకొనే ఆడపిల్లలకిది కనువిప్పుగా ఉంది. కవి చేసిన మార్పుకు కీలకమైన మాట నన్నయభారతంలోనే యిలావుంది. ``అమ్మహాముని వచ్చి యిది ధర్మవిరుద్ధంబుగాదని చెప్పెనేని, నిన్ను వివాహంబగుదునని యయాతి యొడంబడిన"(ఆదిపర్వం3-164) అనేవాక్యం నారాయణకవి చేసిన మార్పుకు ప్రేరకమై ఉండునని భావించవచ్చు.

నాల్గవమార్పు-నన్నయ భారతంలోని శర్మిష్ఠ కథలో యయాతిపై శర్మిష్ఠకు కోరిక గలుగును. ఆమెయే స్వయంగా ఒంటరిగానున్న యయాతిని చేరి, తన కోర్కెను తెల్పుట, యయాతి శర్మిష్ఠ విషయంలో శుక్రాచార్యుని ఆజ్ఞను జ్ఞాపకం చేయగా, ఆమె శుక్రనీతినే వల్లించుట వలన యయాతి ఆమె కోర్కెను తీర్చినట్లుండగా - నారాయణకవి శర్మిష్ఠా శీల విషయంలో కూడ చాల జాగ్రత్త వహించాడు. యయాతి ఒకనాడు అశోకవనంలో విహరిస్తూ శర్మిష్ఠను చూచి తన కోర్కె తెలుపగా, ఆమె దేవయాని వలన కలిగే విపత్కర పరిణామాన్ని పదేపదే హెచ్చరించినా, ఆ కష్టనష్టాలు తను చూచుకొంటానని యయాతి ఆమెను అంగీకరింపచేసి, గాంధర్వవిధిలో వివాహానికి తొందరపడడం చూస్తే యయాతి శీల విషయంలో కొంత శైథిల్యం సంక్రమింపజేసినాడనే చెప్పాలి. కాని, ``పృథివి నేతలు నూతనప్రియులు గారె!" అనే ప్రాచీన సూక్తిని బట్టి యిది సరైన మార్పేనని చెప్పాలి.

ఎందుకంటే, శుక్రాచార్యుడు యయాతిని వృద్ధుడివికమ్మని శపించినా, యింకా యౌవనకాంక్షతో పుత్రులను రావించి వారి యౌవనాన్ని యాచించే యయాతి శీలవిషయంలోని లోపాన్ని మూలకథయే విస్పష్టంగా నిరూపించినపుడు, నన్నయ భారతంలోను యయాతి కథకు కీలకమైన రెండు సమస్యల్లో 1. బ్రాహ్మణస్త్రీ దేవయానిని వివాహమాడటం 2. శుక్రుడు యయాతిని శపించడానికి వెనుక యయాతి యొక్క ``పెరుగుతున్న విషయోపభోగాభిలషణ"మే హేతువని (ఆదిపర్వం3-95) చెప్పబడింది. దీనిచే శర్మిష్ఠను చూచి వ్యామోహితుడై 'నాతిచరామి' అన్న వైవాహిక మంత్రాన్ని జవదాటడం యయాతి పాత్రకు సహజమైన పరిణామమేనని చెప్పవలసి ఉంటుంది.

ఈ విధంగా నారాయణకవి, నన్నయభట్టు కంటే, స్త్రీపాత్రల శీలనిరూపణ విషయంలో ఆధునిక సమాజంలోని స్త్రీ జాతికి తలవంపులు లేనివిధంగా, భారతీయ స్త్రీమూర్తి పవిత్ర శీలవంతురాలని నిరూపిస్తూ, పురుషులే స్త్రీ

చాపల్యంతో ధర్మబాహ్యులై ప్రవర్తించడం పురాణకాలం నుండి ఉన్నదేనని యయాతి కథ ద్వారా నిరూపించాడు.

అట్లని, నారాయణకవి యయాతి పాత్రకు పూర్తిగా అన్యాయం చేయలేదు. ఆ పాత్ర శీల పరిరక్షణలో కొన్ని జాగ్రత్తలు తీసుకొన్న దాఖలాలు కనబడుతున్నాయి. యయాతి లోని అసాధారణ సంయమనాన్ని, నిగ్రహాన్ని సూచించే రెండు మూడు ఘట్టాలను పరిశీలిద్దాం!

ఐదవ మార్పు-నన్నయ కథలోని యయాతి తన వృద్ధాప్యాన్ని గ్రహించి యౌవనం యివ్వడానికి నిరాకరించిన దేవయాని పుత్రులు యదు తుర్వసులను శర్మిష్ఠపుత్రులు ద్రుహ్యుడు, అనువులను-తన నల్వురు కుమారులను క్రూరంగా ఘోరంగా శపిస్తాడు. కాముకుడైన వాడికి క్రోధం తప్పనిసరిగా ఉండి తీరుతుంది. కాని, ఈ శాప వాక్యాల ప్రస్తావన నారాయణకవి రచనలో లేవు. యయాతి తన కోర్కెలోని అసామంజస్యాన్ని చక్కగా భావించిన వాడు గనుక పుత్రులమీది మమకారంతో వారికెవ్వరికీ శాపమివ్వలేదు, సరికదాత తను చిట్టచివర సంసారవిరక్తి పొందినప్పుడు వానప్రస్థాశ్రమానికి పోతూ, ఐదుగురు పుత్రుల్ని రావించి, రాజ్యాన్ని ఐదుభాగాలు చేసి పంచిపెట్టినట్లు వ్రాయడం చూస్తే, నారాయణకవి ఈనాటి తండ్రులకు సందేశాత్మకంగా యయాతి పాత్రకు గాంభీర్యాన్ని, ఔదర్యాన్ని సమకూర్చిపెట్టారని చెప్పవలసివుంది.

ఆరవ మార్పు-నన్నయకథలో వనప్రస్థాశ్రమంలో యయాతి కఠోర తపస్సుచేసి స్వర్గలోకానికి వెళ్లుతాడు. అక్కడ ఇంద్రుడు వేసిన ప్రశ్నకు తన తపస్సు ఋషులు తపస్సుకంటే చాల గొప్పదని తల బిరుసు సమాధానం చెప్పగా, యింద్రుడు యయాతిని స్వర్గలోక భ్రష్టుణ్ణి చేస్తాడు. యయాతి పశ్చాత్తాపంతో చాల ప్రార్థించగా, యింద్రుడు అంతరిక్షంలో ఆయనను నిలుపుతాడు. ఆ తర్వాత ఎంతోకాలానికి యయాతి దౌహిత్రులైన అష్టకాదుల వలన ఊర్ధ్వలోకప్రాప్తి పొందినట్లు చెప్పబడింది. వ్యాసుడు నన్నయ యయాతి పాత్రను తీర్చిన తీర్పు దృష్ట్యా చింత చచ్చినా పులుపు చావలేదన్నట్లుగా, స్వర్గలోకానికి వెళ్లినా యయాతి రాజసం చావలేదని దానికి తగిన ఫలితం అనుభవించాడని చెప్పవలసివుంది. నారద, గరుడాదులకే గర్వభంగమైనప్పుడు వారిముందు యయాతి ఎంత?

కాని, నారాయణకవి తీర్చిన తీర్పులో యయాతి గృహస్థాశ్రమంలోనే పుత్రుల పట్ల ప్రేమానురాగాలు, మమకారాలు చంపుకోలేక ఎంతో

సంయమనాన్ని పాటించినవాడు కావడంవల్ల నన్నయ కథలోని ఈ కథా విస్తృతి అనవసరమైందాన్ని తొలగించాడు. వానప్రస్థాశ్రమంలో తపస్సు చేస్తున్న యయాతిని శ్రీ మహావిష్ణువే మారువేషంలో వచ్చి పరీక్షించడం, ఆ పరీక్షలో యయాతి మనోస్థైర్యానికి మెచ్చుకొని విష్ణువు వైకుంఠప్రాప్తి ననుగ్రహించినట్లు చెప్పడంచేత యయాతి వానప్రస్థాశ్రమ తపస్సులో పరిపక్వదశకు చేరాడని దానితో అంతశ్శత్రువులైన అరిషడ్వర్గాలు జయించాడని అందుకే విష్ణు సాయుజ్యాన్ని పొందాడని తెలుపుబడింది. స్వర్గలోక ప్రాప్తి అనేది ఎట్లైనా తాత్కాలికమే. ``క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి" అనికదా గీతావాక్యం! దీన్ని త్రోసిరాజని "నచపునరావర్తతే" అని చెప్పిన ఉపనిషద్వాక్యాన్ని సమర్థిస్తూ పునరావృత్తియే మోక్షాన్నే యయాతి పొందినట్లు నారాయణకవి వ్రాయడం అత్యంతసమంజసంగా ఉంది.

ఇంతేకాదు, నారాయణకవి తాను స్వీకరించిన యితివృత్తపరిధిలో పాత్రల మనః ప్రవృత్తి ననుసరించి ప్రకృతివర్ణనలు చేయడంలో ముఖ్యంగా యయాతి కథలో వసంత, గ్రీష్మ, వర్ష ఋతువర్ణనలు సందర్భానుసారంగా చేయడం ఆయన మనోవైజ్ఞానిక దృష్టికి నిదర్శనం. ఆయా సందర్భాలలో కథాగమనంలోని మార్పును సూచించే విధంగా విశేషవృత్తాలు వాడి వృత్తౌచిత్యంతో కథాకథనౌచిత్యాన్ని కాపాడడం చేత ఈయన కథాకథన శిల్ప మర్మజ్ఞుడని, ఛందోరహస్యవేత్తయని కంఠోక్తిగా చెప్పవచ్చు.

నాణ్యమైన ఆణిముత్యాల సూక్తులు

నన్నయ భట్టు నానారుచిరార్థసూక్తి నిధియైనట్లే, నారాయణకవి కూడ నాణ్యమైన ఆణిముత్యాల వంటి సూక్తులుగల పద్యాలను వ్రాయడంలో ఆరితేరినవాడు. ఈ ప్రబంధంలో ఎన్నో సూక్తిరత్నాలున్న ప్పటికీ ఒక్క యయాతి కథలోని కొన్ని సూక్తుల్ని మాత్రం స్వీకరిస్తున్నాను.

గర్వపడినంతమాత్రాన గలదె సుఖము? (1-22)

కినుకలోన కన్నెకృపను గనునే? (1-24)

తన్విప్రకోపము హానిగూర్పదే! (1-28)

స్వానుభవమొండునజ్ఞతన సంస్కరించు(1-28)

పేరొందు సుతులు గలసతియె ధారుణిలో ధన్యురాల్ను ధర్మముఁ దెలియన్ (1-77)

పతిని బొందిన లేదు గొప్పది భాగ్యమూర్తియె ధారుణిన్ (1-78)

నన్నయ చెప్పిన రుచిరార్థ సూక్తులతో పోల్చిచూచినపుడు నారాయణకవి సూక్తులే మాత్రం తీసిపోక వుండడం గమనింపవచ్చు.

మచ్చుకు రెండు -

శుక్రాచార్యుఁడు దేవయానికి హితవు చెప్పే ఘట్టంలో -

1. క్రతుసహస్రంబులు సేసినవారికంటె

నక్రోధనుఁడు గరం బధికుండండ్రు తత్త్వవిధిజ్ఞాత

-నన్నయభట్టు (ఆది.3-146)

పరగయజ్ఞశతము సేయు ప్రభువు కంటె

కోపహీనుండు ఘనుఁడన గోచరించు-నారాయణ కవి(1-44)

శర్మిష్ఠ చిన్నకుమారుడు పూరుఁడు, తండ్రి యయాతికి తన యౌవనాన్ని యిచ్చి వృద్ధాప్యాన్ని స్వీకరించినప్పుడు-

2. తనయుండు తల్లిదండ్రులు

వనిచినపని సేయడేని, పలుకెదలో జే

కొనడేని వాడు తనయుం

డనబడునే పితృధనమున కర్హుండగునే? - నన్నయ్యభట్టు (ఆది.3-199)

పనిజిన పనులన్ జేయుట

జననీ జనకులకు సేవ జరుపుట, వారిన్

మనుచుటఁ గోర్కెలఁ దీర్చుట

తనయుని కర్తవ్యమండ్రు ధర్మవిధిజ్ఞుల్ - నారాయణకవి (1-121)

మొదటిదానిలో నన్నయనే అనుసరించినా వ్యక్తీకరణ విధానంలోని సారళ్యంలో నారాయణకవిదే పైచేయి. పైగా `ప్రభువు' అనే పదప్రయోగంలోని

ఔచిత్యం సంభావింపదగింది.

రెండవదానిలో నన్నయగారి రచనా ధోరణి ప్రభుసమ్మితమైన వేదవాక్యంవలె కటువుగా నుండగా, నారాయణకవి రచనాశైలి కాంతసమ్మితమైన కావ్యవాక్యంవలె పరమరమణీయంగా ఉంది.

మరొక సూక్తిలోని చమత్కారం గమనింపదగింది.

ధనమిచ్చి పుచ్చుకొన్నను

మనమున నోర్వంగవచ్చు మానుగధరలో

మనసిచ్చి పుచ్చుకొన్నను

మనదగునే నింకనేటిమాటలు చెలియా! - పారిజాతాపహరణము.

ధనమిచ్చియు జోవిడచిన

మనుజేశుని నమ్మవచ్చు మానుగమహిలో

గనుజాటున బరకాంతకు

మనసిచ్చిన వానినమ్మ మగువలు గలరే! - నారాయణకవి (1-97)

రుక్మిణిపై అధికప్రేమాభిమానాలు ప్రదర్శించిన శ్రీకృష్ణుని తలచుకొని సత్యభామ చెలికత్తెలతో నన్నపద్యంపారిజాతాపహంణంలోనిది. తనకు పరోక్షంలో తనదాసి శర్మిష్ఠతో సంసారంచేసి ముగ్గురు పుత్రుల్ని కన్న యయాతి విషయంగా దేవయాని పొందిన మనో వ్యథ రెండవ పద్యంలోనిది. సవతి విషయంలో సత్యభామది కేవలం అసూయాజనితమైన ఆక్రోశంకాగా, ఆ పద్యభావం దేవయాని కథా ఘట్టానికి నూటికి నూరుపాళ్ళు సరిపోవడాన్ని గుర్తించి నారాయణకవి ఆ భావాన్ని గ్రహించి తనదైన శైలిలో చెప్పడంచేత ఆయన కథాగతి మర్మజ్ఞుడని చెప్పవచ్చు.

## పూర్వకవీశ్వర వాక్ప్రయోగదక్షత

"పూర్వకవీశ్వర వాక్ప్రయోగ దక్షుడు కరుణామతియెవ్వడతడు కవియన బరగున్" అని అప్పవీయము చెబుతున్నది. కవియైన వానికి పూర్వకవుల

పద్య రచనా పోకడలు, పదప్రయోగ చాతుర్యం బాగా తెలిసి ఉండాలి. అప్పుడే పద్యరచనా శిల్పంలో వినూత్న ప్రయోగాలు చేయగల సామర్థ్యం ఏర్పడుతుంది.

ఈ పొత్తపినాటి పుత్తడి కవిపై కడప మండల కవులైన నాచనసోమన, పోతన, పెద్దన, ధూర్జటుల ప్రభావం కనబడుతుంది. ఉదాహరణకు ఈ సూర్యోదయవర్ణన చూడవచ్చు.

``ప్రాగ్దిశా భామినీఫాలంబునందున

జెలువొందు సిదూర తిలకమనుగ" - నారాయణ కవి (1-68)

``కుంకుమహత్తించి కొనగోరదీర్చిన

పురుహూతునిల్లాలి బొట్టనంగ" - ఉత్తరహరివంశము (3-86)

``సకుటుంబముగ వీ7గి చరమశైలము7జేరు

తుహినాంశు దుముదారు దొర యనంగ" - మనుచరిత్ర (3-54)

`` ప్రాగ్వ ధూమణి చిమ్మ పశ్చిమదిక్కాంత

పట్టిన చెంగల్వబంతియన7గ" - శ్రీ కాళహస్తిమాహాత్మ్యము

స్థాలీపులాకన్యాయంగా ఈ ఒక్క ఉదాహరణ యివ్వబడింది. ఇటు వంటివెన్నో ఉన్నాయి.

పదప్రయోగవైచిత్రిని గమనిస్తే శుక్రాచార్యుడనే పేరు కెన్ని నామాంతరాలను కవి సందర్భానుసారంగా ప్రయోగించాడో ఆశ్చర్యం కల్గిస్తుంది. భార్గవు7డు, కవి, కావ్యుడు ఉశను7డు, గురు7డు, శుక్రు7డు, దనుజాచార్యు7డు యిత్యాదులు. ``కవీనాముశనః కవిః" అని భగవద్గీత విభూతియోగం. దేవతలు అనడానికి అస్వప్నకుల్, త్రిదశులు, దివిజులు అనడం కవి భాషాప్రయోగసామర్థ్యాన్ని పట్టియిస్తున్నవి.

ఛందోవైవిధ్యం

ప్రాచీనసాహిత్యంలో ఛందోవైవిధ్యాన్ని ప్రదర్శించిన కవుల్లో కవిత్రయం తర్వాత నాచనసోమన, పెద్దన, రామరాజభూషణుడు, గణపవరపు వేంకటకవి. చేమకూర వేంకటకవి ప్రభృతులున్నారు. ఆధునికుల్లో కవిసమ్రాట్ విశ్వనాథసత్యనారాయణ రామాయణ కల్పవృక్షంలోను, మోటూరి వేంకటరావు

పద్మినీభాస్కరములోను, తుమ్మపూడి కోటేశ్వరరావు కుమార భారతీ కావ్యంలోను వివిధ ఛందోగతుల్ని నిరూపించారు. వీరి తర్వాత గోకులాభ్యుదయ ప్రబంధ కర్త నారాయణకవి పేర్కొనదగినవాడు.

గోకులాభ్యుదయమనే మూడు అశ్వాసాల ప్రబంధంలో నారాయణకవి 31 విశేష ఛందములను వృత్తౌచిత్యదృష్ట్యా ప్రయోగించియున్నాడు. దీనిచే కవికి ఛందస్సుపైగల సాధికార ప్రజ్ఞ తేటతెల్లమవుతున్నది. ఆయా ఛందస్సుల విశేష వివరాలు గ్రంథాంతంలో సమకూర్చబడినది కాబట్టి యిక్కడ మరల ప్రస్తావించడం లేదు. ఛందోగతి విశేషజ్ఞతకు ఈ అంశం ప్రత్యేకించి పరిశీలింపదగింది.

ఉపసంహారం

అవతారికలో అంకితాంక పద్యం లేకపోవడం, అవతారిక చివరలో షష్ఠ్యంతాలు లేకపోవడం చూస్తే నారాయణకవి నన్నయ భారతావతారికాపద్ధతిని పాటించినాడేమోననిపిస్తున్నది. ఆశ్వాసాది, అంత్య పద్యాలవలన ఇది శివాంకి తమని తెలుస్తోంది. మొదటి రెండు అశ్వాసాంతాల్లో పద్యాలుండగా తృతీయాశ్వాసం చివర పద్యాలు లేకపోవడం చింత్యం. కృష్ణలీలల్లో అత్యంతప్రధానమైన కంసవధకు సంబంధించిన పద్యం లేకపోవడం ``ప్రమాదో ధీమతామపి" అని సరిపెట్టుకోవలసిందే!

వసుదేవునికి "ఆనకదుందుభి" అనేపేరు ప్రసిద్ధంగా భాగవతంలోను, నాచనసోమన ఉత్తరహరివంశంలోను, దోనూరు కోనేరునాథుని పద్య-ద్విపద బాలభాగవతాల్లోను ఉండగా ఈ కవి `నాకదుందుభి' అనడం గమనింపదగింది. వసుదేవుడు భూలోకంలో పుట్టినపుడు నాకలోకంలోని ఆనకములు, దుందుభులు వాటంతట అవే మ్రోగడం చేత ఆయనకా పేరువచ్చింది. `ఆనకము 'అనగా తప్పట, దుందుభి' అనగా ఢంకా!

కవి ద్వాపరయుగంలోని కథవ్రాస్తూ కారాగృహమనే మాటకు చెఱ `చెఱసాల' `కార',కారాగారము, `శ్రీకృష్ణజన్మస్థానము', వంటి ఎన్నో మాటలుండగా ఉర్దూపదమైన ``బందిఖానా" అనే పదాన్ని రెండుసార్లు ప్రయోగించడం, కథా కాలౌచిత్యం పాటించక చేసిన పదప్రయోగం అనవలసిఉంటుంది. ``ఎందుకయ్యా ఉంచీనావూ బందిఖానలో" అని భక్తరామదాసు అన్నాడుకదా! అంటే ఆయన తానీషా అనే మహమ్మదీయుని ఏలుబడిలోనివాడు. కాబట్టి ఔచితవంతమే! కథాకాలానికి సరిపడే పదజాలమే కవి ప్రయోగించాలి!

అధునికతముద్రను సాధ్యమైనంతగా పరిహరించాలి.

కవివాడిన కొన్ని వైరి సమాసాలు, శబ్దప్రయోగాలు సవరణకు వీలిచ్చేవి. ఈ క్రిందివిధంగా సవరింపబడినవి.

1 తనర7గా నా పాదతాకిడి వలన -సరగున నాపాదస్పర్శంబు వలన (3-46)

2. నత7డుజైలు కడకువచ్చి (3-51) - నత7డు కార కడకు వచ్చి

3 దావము రూపుమాపెనది (3-72) - దావము మ్రింగివేసెనట!

4. తాదృశ భావము గాంచలేమిలన్ (3-72) - తాదృశకార్యము గాంచలేమిలన్

5. చంద్రసూర్యణే క్షణా! (1-163) - చంద్రసూర్య వీక్షణా!

మిక్కిలి చిన్న పరిధిలో బ్రహ్మాండమంత పౌరాణిక, చారిత్రక కథావస్తువుగల ప్రబంధాన్ని నిర్వచనంగా, ఛందోవైవిధ్యభరితంగా వ్రాయడం కత్తిమీద సామువంటిదే! ఇటువంటి ఘనకార్యాన్ని అవలీలగా సాధించిన నారాయణకవిని `రాయలసీమ కవిరత్నంగా" సంభావిస్తూ, కవిని మనస్ఫూర్తిగా అభినందిస్తూ, వీరింకా చక్కని కథావస్తువును గ్రహించి సంక్షుభిత అధునిక సమాజానికి పన్నీటిజల్లులా సందేశాత్మక కావ్యాలను అందిస్తారని ఆశిస్తున్నాను. గుండాల కోనేశ్వరుడు వీరికా శక్తియుక్తులను ప్రసాదించుగాక!

ముదివేడు ప్రభాకరరావు

తిరుపతి,

20-3-2002.

భద్రి బాల సుబ్బరాయుడు ఎం.ఏ(లిట్), ఎం.ఎడ్.,
లెక్చరర్ ఇన్ ఇంగ్లీష్
ఎన్.బి.కె. ఆర్ కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్,
విద్యానగర్, నెల్లూరు జిల్లా.

పూజ్య గురువర్యులు, కవివర్యులు శ్రీ బి.వి నారాయణగారు నిత్యసాహిత్య కృషీవలురు. వీరిది పండిత వంశము. వీరి తాతగారు కీ.శే. శ్రీ నాగయ్యగారు, వీరి తండ్రిగారు కీ.శే. శ్రీ గోపాలయ్యగారు సంస్కృతాంధ్రభాషలలో విశేషమైన పాండిత్యమును సముపార్జించారు. వీరి యింటిపేరు `బొడ్డుబోయిన' అయినా వీరు అనాదిగా తమ చుట్టు ప్రక్కల వారికి `విద్యాబుద్ధులు' నేర్పినందువల్ల వీరిని `చదువులవారని' పిలవడం పరిపాటయినది. ఇలాంటి పండిత కుటుంబములో జన్మించిన శ్రీ బి.వి. నారాయణగారు శివభక్తులు, నిత్యం ఆధ్యాత్మికతను ప్రబోధించెడి నిర్మల మనస్కులు. ఇంతకుపూర్వం వీరు రచించిన శ్రీ గుడాల కోనేశ్వర శతకము, భక్త మందార శతకములను చదివాను. ఈ శతకములలోని ప్రతి పద్యము బహు హృద్యముగా, ఆధ్యాత్మికత్వమును ప్రబోధిస్తున్నది. ప్రస్తుతము వీరు రచించిన `గోకులాభ్యుదయమును చదివితిని. యదువంశచరిత్రను కవిగారు ముచ్చటగా, మనోరంజకమముగా మూడు ఆశ్వాసములలో వర్ణించారు. ప్రధమాశ్వాసములో యదువంశ చరిత్ర పుట్టుక గూర్చి చక్కగా వివరించారు.

ద్వితీయాశ్వాసంలో యదువంశమందలి సార్వభౌముల, వైభవ, ప్రాశస్త్యాలను గూర్చి తెలిపారు. తృతీయాశ్వాసములో యదుకుల భూషణుడైన శ్రీ కృష్ణభగవానుని దివ్య లీలలగూర్చి మనోజ్ఞముగా వివరించారు. చారిత్రాంశకములైన రాష్ట్రకూటుల, హొయ సాల వంశ రాజులగూర్చి వర్ణించారు.

ఈ గోకులాభ్యుదయమునందలి కథ `శ్రీహరి'కి సంబంధిచినదయినా కవిగారు ఈ కృతిని హరునికి అంకితమిచ్చి, `హరి హరు'లొక్కటే అనే సత్యాన్ని లోకానికి చాటారు. `గీతా'బోధకుడైన శ్రీ కృష్ణభగవానుని చరిత్ర గూర్చి విపులముగా వివరించు ఈ `గోకులాభ్యుదయము' పండిత పామరులకు, నిత్య ఆధ్యాత్మికతను ప్రసాదించెడి కవితా మందారము.

మాన్య కవివర్యులు శ్రీ బి.వి. నారాయణగారి కలం నుండి ఆధ్యాత్మికతను ప్రబోధించెడి మరిన్ని కృతులు వెలువడగలవని మనసా, వాచా కోరుకుంటున్నాను.

నమస్సుమాంజలులతో

తమ విధేయుడు,
**భద్రి బాలసుబ్బరాయుడు.**

ముక్కంటి భక్తుడు కృతికర్తకు ముక్కందమాల

కం|| బీవీ నారాయణకవి

భావావేశంబ "వాణి" భాగ్యవరంబై

జీవాక్షరముల చల్లెను

సేవలు తాపొంద తగును శిష్టకవులలాన్!

కం|| గోకుల చరితామృతమును

శ్రీకరముగ పంచి హరి వి శేష చరిత్రన్

ప్రాకట మొప్పగ పొందిన

``ధీ" కవి మాన్యుండు ``బీవి" ధీమంతులలోన్!!

ఈ గోకులాభ్యుదయ ప్రబంధము

కం|| దివ్య-ప్రబంధములందున

నవ్యత చేకూర్చి ``కర్త" నారాయణ్ణకనిన్

భవ్య చరిత్రుని చేయుచు

అవ్యయ నుతనేర్తిగూర్చు అంచితమొప్పన్!!

ఇట్లు

**పల్లేటి లక్ష్మీ కులశేఖర్-**

రచయిత,

నంది అవార్డ్స్ విన్నర్.

రైల్వేకోడూరు

15-4-2002

# కృతజ్ఞతాంజలి

ఆంధ్రుల ప్రాచీన సాంఘిక వైజ్ఞానిక, రాజకీయ జీవన విధానము పెరుగుటకు వారి సాహిత్య సంస్కృతి దర్పణముగా విరాజిల్లు చున్నది. అటువంటి సాహిత్యంలో శ్రీ కృష్ణభగవానుని భగవద్గీత తెలుగు వారి ఆధ్యాత్మిక చింతనకు, ధార్మిక జీవన విధానమునకు ప్రతీకగా వెలసియున్నది. అటువంటి మహనీయుని చరిత్ర రచించిన కవియే ధన్యుడునని తలంచితిని. కాని దగిన సమయము త్వరగా నాకు లభించదాయెను. సుమారు పదునైదేండ్లకు ముందు కడపజిల్లాలో గడు ప్రసిద్ధిగాంచిన శ్రీ వీర బ్రహ్మేంద్ర స్వాములవారి మఠమున యాదవ మహా సభ ఏర్పాటు చేయబడెను. ఆ సభకు యాదవ మహాశయులు రాజకీయవేత్తలు, వైజ్ఞానికులు, కవులు మున్నగువారు ఆంధ్రప్రదేశ్ నలుమూలల నుండి విచ్చేసిరి. యాదవ ప్రముఖులనేకులు శ్రీకృష్ణుడుదయించిన వంశమును గుఱించి ఉపన్యసించిరి. అట్టి మహత్తర సభయందు నాకును కవి సన్మానము లభ్యమైనది. సన్మానానంతరము నేను నాచే రచింపబడిన 'శ్రీ గుండాల కోనేశ్వరా' అను శతకము నుండి కొన్ని పద్యములను జదివి వినిపించితిని. అంతవేదికనలంకరించిన పెద్దలు అమితానందస్వాంతులై 'శ్రీకృష్ణచరితము'ను రచించుమని తమ మనోభిప్రాయములదెలియ బరచిరి. ఆ చరిత్రను తెలుపు పోతన భాగవతమున్నదికదా అల్పజ్ఞుడనైన నేను ఆ మహచ్చరిత్రము మరల వ్రాయుట అది సాహసమైన పనియని యనుకొనుచు, అయిన ఏదో నా మనసులో దైవ ప్రేరితమైన భావముతోచగా, ఆ చరిత్రను తప్పక వ్రాసెదనని సభాముఖముగా విన్నవించితిని. మహాసభ జయప్రదముగా ముగిసినది.

అనంతరము నా స్వగ్రామమును జేరుకొని, ఇష్టదైవమగు శ్రీ గుండాల కోనేశ్వర స్వామిని మనసార స్మరించి, గోకులాభ్యుదయంబనబడు ఈ ప్రబంధమునకు శ్రీకారము జుట్టితిని. ఇందులో యయాతి చరిత్రను ప్రారంభించి, యాదవ వంశ చరిత్రమును శ్రీకృష్ణజననమును శ్రీకృష్ణలీలలు, ప్రాచీన భారతదేశ చరిత్రలో వెలసిన హొయసాలులు, రాష్ట్రకూటులు, మున్నగువారి రాజకీయ, సాంఘిక, వైజ్ఞానికాదుల విశేషప్రజ్ఞాప్రాభవములుగల అంశముల గూర్చి పొందుపరచితిని.

తృతీయాశ్వాస ప్రయుక్తమైన ఈ ప్రబంధమును నాయిష్టదైవమగు శ్రీ గుండాల కోనేశ్వర స్వామికే అంకిత మిచ్చితిని. శ్రీ మహాభాగవతము, విష్ణుపురాణము, మున్నగు విష్ణు కథాంశములుగల నాటి, నేటి రచనలు ఈ ప్రబంధ రచన కుపయోగపడినవి.

నిరంతర కార్యాచరణ దక్షులు, సుమారు వింశత్యధిక కావ్యకర్తలు, చిత్రలేఖనాది లలితకళలందు సుప్రసిద్ధులు. ఆంధ్రావనిలో `లలితకళానిధి' బిరుదాంకితులు. ఈ గ్రంథ పరిష్కృత మాన్యులు. ఈ గ్రంథమునకు `అభ్యుదయరేఖ' అనుగ్రహించిన బ్రహ్మశ్రీమైనంపాటి వేంకటసుబ్రహ్మణ్యంగారికి, వారి శ్రీమతి సౌభాగ్యవతి సరోజాదేవిగారికి నా హృదయపూర్వక నమస్సుమాంజలు లర్పించుచున్నాను. మూలమున చారిత్రక ప్రాధాన్యంగల యాదవ వంశ చరిత్రలో పూర్వాపరములు సమీక్షించి అమూల్యమైన `అగాధజలనిధిలో ఆణిముత్యం'లో తమ అభిప్రాయములను అందించిన నిత్యసాహిత్య పరిశోధకులు డాక్టర్ మాన్యశ్రీ ముదివేడు ప్రభాకరరావ్, Ph.D. గారికి, చిరంజీవి భద్రిబాలసుబ్బరాయడు ఎం.ఎ (లిట్) ఎం ఎడ్ (లెక్చరర్ ఇన్ ఇంగ్లీష్ ఎస్. బి.కె.ఆర్. కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్, విద్యానగర్, నెల్లూరు జిల్లా) గారికి, నంది అవార్డు గ్రహీత చిరంజీవి పల్లేటి లక్ష్మి కులశేఖర్ గారికి, ఈ గ్రంథముపై ఇచ్చిన అమూల్య అభిప్రాయములు నా భవిష్యత్ సాహిత్య జీవనమునకు మార్గదర్శకములై విరాజిల్లుటవలన, వారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాంజలి.

సప్తగిరీశుడు, భక్తవత్సలుడు అగు శ్రీ వేంకటేశ్వరునకు ప్రతినిధిగా భాసిల్లిఈ ప్రబంధముద్రణకు ఆర్థిక సహాయమందించిన తిరుమల తిరుపతి దేవస్థానముల నిర్వహణాధికారియగు మాన్య శ్రీ P. కృష్ణయ్య, I.A Sగారికి మరియు పాలక మండల సభ్యులకు నా కృతజ్ఞతాపూర్వక నతులు సమర్పించుచున్నాను. సప్తగిరి పత్రికా ప్రధాన సంపాదకులగు మాన్యశ్రీ N.S. రామమూర్తి M.A. గారి, నా వందనములు

ముద్రణా స్ఖాలిత్యములను జక్కదిద్దుటలో సహాయపడిన శ్రీ ముదివేడు ప్రభాకరరావు. ఎం.ఏ. పిహెచ్‌డి (అసిస్టెంటు ప్రాచ్యపరిశోధనాలయం శ్రీ

వేంకటేశ్వరవిశ్వ విద్యాలయం తిరుపతి) గారికి, గోకులాభ్యుదయ ప్రబంధమును సర్వాంగ సుందరముగా లోకానికి సమర్పించుటలో అర్థాపేక్షయే ప్రధానమనీ భావించక, తమ ముద్రణాలయమున శ్రద్ధగా ముద్రింపజేసిన కీర్తి ప్రింటర్స్ అధినేత చిరంజీవులగు శ్రీ P పురందర నాయుడు గారికి, వారి చి||కు||సౌభాగ్యవతి పీతాంబరి గారికి వారి సిబ్బందికి నా కృతజ్ఞతాభి వందనములు.

ఈ రచనలో పేర్కొన్న చారిత్రక అంశముల ఆధారముతో పరిశీలించి, తెలిసినంతవరకు సత్యములని భావించి, స్వీకరించితిని. ఏవైన అందు లోపములున్నచో దయయుంచి చరిత్ర విజ్ఞానులు, పండితులు, సహృదయముతో నాకు తెల్పిన, వానిని సవరించుకొనగలనని మనవి చేసికొనుచున్నాను. కవితా రసజ్ఞులైన మహనీయులు, నా యీ సాహిత్య సాహసకృషిని ఆమోదించి నా అభ్యున్నతికి, ఆశీర్వదించగలరని, విశ్వసించుచు, కృతజ్ఞతా దోయిలి బట్టి వేడుకొనుచున్నాను. మనవి మన్నింతురుగాక.

ఇట్లు,
బుధ విధేయుడు
**బి.వి. నారాయణ**
లక్ష్మిగారిపల్లె
రైల్వేకోడూరు మండలం.
12.3.2002
మహాశివరాత్రి.

# గోకులాభ్యుదయము

## విషయాను క్రమణిక

# ప్రథమా శ్వాసము

20. శర్మిష్ఠ చెలికత్తెలతో దాసిగా దేవయాని వెంట పోవుట
21. దేవయానికి యదు తుర్వసులను నిద్దఱు కుమారు లుదయించుట
22. ఊడిగపు బ్రతుకులో నలిగిపోయిన శర్మిష్ఠ లోలోపల దుఃఖించుట
23. అశోకవనములో విహరించుచున్న యయాతి శర్మిష్ఠను చూచి మనోభీష్టము నెఱింగించుట
24. శర్మిష్ఠ దేవయాని వలన కలుగు ప్రమాదమును గుర్తుచేసినను యయాతి యా మాటల త్రోసి పుచ్చుట
25. గాంధర్వ విధిలో శర్మిష్ఠను యయాతి పరిణయమాడుట
26. శర్మిష్ఠకు ద్రుహ్యుడు, అనువు, పూరుఁడనబడు ముగ్గురు కుమారులు గల్గుట
27. దేవయాని కీవిషయము తెలిసి శర్మిష్ఠను పిలిపించి యడుగగా ఒక ఋషి కరుణించి పుత్రదానము చేసెనవి చెప్పుట
28. ఒకనాడు దేవయాని శర్మిష్ఠ పుత్రుల రూపురేఖలు చూచి సందేహించి భర్తను నిలదీయగా నతడంగీక రించుట
29. గ్రీష్మఋతు వర్ణనము
30. యయాతి క్షమింపుమని వేడుకొన్నప్పటికీ దేవయాని కోపోద్దీపితయై తండ్రికీ విషయము నెఱిఁగించుట
31. శుక్రాచార్యుఁడు ఆగ్రహోదగ్రుఁడై యయాతి ముసలివాడ గునని శపించుట
32. యయాతి మన్నింపుమని వేడగా శుక్రాచార్యుఁడు కరుణించి, నీ ముదిమిని నీ పుత్రులలో నొకడు గ్రహించిన చో నీకు యౌవన ప్రాప్తి యగునవుట
33. శరీరము ముసలిదైనా మనస్సులో కోర్కెచావని యయాతి దేవయానీ పుత్రులైన యదు, తుర్వసుల నడిగి విఫల మనోరథుఁడగుట
34. చిట్టచివరికి, శర్మిష్ఠ పుత్రులలో చివరి వాడైన పూరుఁడు తండ్రి కోర్కెను మన్నించుట
35. యయాతి పూరుని ఉదార హృదయమును త్యాగనిరతిని ప్రశంసించుట
36. పూరుని యౌవనము దాల్చిన యయాతి వేయిసంవత్సరములు భోగభాగ్యాల ననుభవించి విరక్తుఁడై రాజ్యసంపదను పుత్రులకు పంచియివ్వాలని తీర్మానించుట
37. మొట్టమొదలు పూరుని యౌవనాన్ని ఆతనికి తిరిగి యిచ్చి తన వృద్ధతను యయాతి స్వీకరించుట
38. రాజ్యములో దక్షిణదిగ్భా గాన్ని యదువుకు, పశ్చిమదిగ్భా గాన్ని తుర్వసునకు, ప్రాగ్దిశా రాజ్యాన్ని ద్రుహ్యునికి, ఉత్తర దిశా భాగాన్ని అనువుకు, మధ్యభాగాన్ని పూరునికిచ్చి పట్టాభిషేకము చేయుట
39. పూరునికి యయాతి రాజనీతి నుపదేశించుట

# ద్వితీయా శ్వాసము

## తృతీయా శ్వాసము

11. తనకు పుట్టిన ఏడుగురు పుత్రులను వరుసగా వసుదేవుఁడు కంసుని కడకు పంపగా వారిని చంపక నాతడు విడిచి పెట్టుట
12. అంతలో నారద మహర్షి యేతెంచి దేవకీదేవి అష్టమగర్భం శిశువు, కంసుని పరిమార్చునని ఘంటాపథముగా జెప్పుట
13. నారదుని మాటలు విని కోపోద్రిక్తుఁడైన కంసుఁడు చంపక విడచిన వసుదేవుని పుత్రుల నేడ్గురిని, కత్తి కెఱజేయుట
14. విష్ణువు యోగమాయను పిలిచి దేవకి గర్భములో శేష మనే పేరుతో పెరిగే తేజాన్ని రోహిణి గర్భములో నుంచవలసిందని యాజ్ఞాపించుట
15. దేవకీ దేవి గర్భములో మహావిష్ణువు ప్రవేశింపగా యోగమాయ యశోదాగర్భములో ప్రవేశించుట
16. దేవకీ వసుదేవులను కంసుఁడు చెఱసాల నిడుట చరాచర ప్రకృతి పులకరించి, పరిమళింపగా కారాగృహములో శ్రీకృష్ణ జననము
17. వసుదేవుఁడు విష్ణువును మార్గ నిర్దేశము చేయుమని కోరగా స్వామి కర్తవ్యము బోధించుట
18. బాలకృష్ణుని పొత్తిళ్లలో శిరస్సుపైనిడి కొని వసుదేవుఁడు యమునానదిని త్రోవ యడుగగా నది రెండుగా చీలి దారినిచ్చుట
19. వసుదేవుడు వ్రేపల్లెచేరి యశోదమ్మ ప్రక్కన పడుంచ బెట్టి, అక్కడున్న బాలికను తెచ్చి దేవకి ప్రక్కనుంచుట
20. దేవకి ప్రక్కన వరుండ బెట్టిన శిశువు యేడ్వగా భటులు మేల్కాంచి కంసున కావార్త దెల్పుట
21. కంసుని కాళ్లు పట్టుకొని దేవకి స్త్రీ శిశువును చంపవద్దని బ్రతిమాలుట
22. కంసుఁడు దేవకి మాటలు పెడచెవిని బెట్టి బిడ్డను పైకివిసరివేసి కత్తి పట్టుట
23. ఆకసాని కెగసిన యోగమాయ శక్తిస్వరూపిణియై నిల్చి, యశోద కన్న సంతానము కంసుని పరిమాప్చునని ప్రకటించుట
24. నల్లని శరీరచ్ఛాయ గల్గిన కృష్ణుని స్త్రీలు కృష్ణుఁడని నామకరణము చేయుట
25. బాలకృష్ణుని పూతనాసంహారము
26 శకటాసురసంహారము
27. తృణావర్త వధ
28. మన్ను తిన లేదని బాలకృష్ణుడు నోటిలో బ్రహ్మాండ భువన భాండములు యశోదమ్మకు చూపుట
29. బాలకృష్ణుని అల్లరిచేష్టలకు విసిగి యశోదమ్మ అతనిని రోలుకు కట్టివేయుట

30 కాళింది మడుగున కాళియుని పడగలపై నాట్యమాడి చిన్ని కృష్ణుఁడు వాని కభయ ప్రదానము చేయుట

31 బ్రహ్మదేవుఁడు గోగణములను దాచివేయగా శ్రీ కృష్ణుఁడది గ్రహించి సంవత్సరకాలము గోగణాకృతి ధరించి అడవికి యింటికి తిరుగుట

32. గోవర్ధనోద్ధరణము

33. వత్సాసుర సంహారము

34. శ్రీ కృష్ణుఁడు దవానల పానము చేయుట

35. క్రౌంచాసుర వధ

36. వృషభాసుర సంహారము

37 కేశి, వ్యోమాసుర సంహారము

38. శ్రీ కృష్ణుఁడు గోపికలతో రాసక్రీడసల్పుట

39. అజగరాసుర సంహారము

40. దంతవక్త్ర సంహారము

41. శిశుపాలుని శిరచ్ఛేదము చేయుట

42. సాల్వుని సంహారము

43. కౌరవసభలో విశ్వరూపము చూపుట

44. బాల్యసఖుఁడు కుచేలుఁడు తెచ్చిన పిడికెడు అటుకులు తిని అష్టైశ్వర్యము లను గ్రహించుట

45. దుర్యోధనుఁడు పంపగా వచ్చిన దుర్వాసుఁడు పాండవులను పరీక్షించి ఓడిపోయి శపింపలేక సిగ్గుచే వెనుదిరిగి పోవుట

46. నరకాసురవధ

47. శ్రీ కృష్ణుఁడు అర్జునునకు గీతోపదేశము చేయుట

48. గోపికావస్త్రాపహరణము

49. జాంబవంతునికి విశ్వరూపము చూపి సత్యభామను పెండ్లాడుట

50. పౌండ్రక వాసుదేవుని వధించుట

51. కలియుగ యాదవ వంశ క్రమము

52. రాష్ట్రకూటుల వంశక్రమము

53. దేవగిరిని పరిపాలించిన సేవిణుల వంశము

54. కల్యాణీ చాళుక్యుల చరిత్రము

55. చాళుక్య సోమేశ్వరుని ఘనత

56. కాలచురి వంశస్థుల ప్రతిభ

57. హోయసల భల్లాలుని గొప్పతనము

58. రాష్ట్రకూట రాజగు కృష్ణుని ఘనత

59 కాకతీయులు రాష్ట్రకూటుల కోడిపోవుట

60. దేవగిరి సేవిణులపై ముస్లిములు ఆధిక్యత సంపాదించుట

61. మాలిక్ కపూర్ శంకర దేవుని సంహరించుటతో యాదవరాజ్యము ఖిల్జీప్రభువు హస్తగతమగుట

62. యాదవుల కీర్తి పతాకను నిలబెట్టుటకై కల్యాణి చాళుక్యులు కృషిచేయుట

63. కల్యాణి చాళుక్యుల కాలంలో మరాఠీ భాషలో వెలువడిన ప్రముఖ శాస్త్ర గ్రంథాలు

64. హోయసలులు చోళవిభుడైన కులోత్తుంగ చోళుని గెల్చుట

65. హోయసల వీరభల్లాళుడు 'వీరాధివీర' బిరుదము దాల్చగా చోళవిభుడు తన కుమార్తెనిచ్చి పెండ్లి సేయుట

66. వరభల్లాళుడు భల్లశకము ప్రారంభించుట

67. భండన భీముడైన రెండవ నరసింహుడు పాండ్యరాజుల నోడించుట

68. సోమేశుడు పాండ్యుల మరల నోడించుట

69. మూడవ నరసింహుడు ద్వారసముద్రము నుండి, రామనాధుడు కన్నలూరు నుండి రాజ్యపాలనము సేయుట

70. మూడవ భల్లాళుని అల్లా ఉద్దీన్ ఖిల్జీ పంపిన మాలిక్ కపూర్ యుద్ధములో సంహరించుటతో యాదవ రాజ్యము పతనమగుట

71. జైనమతావలంబకులైన రాజులు రామానుజమతము స్వీకరింపగా కాలచురి విప్లవముతో బసవేశ్వరుని వీరశైవ మతము విజృంభించుట

72. మధ్వాచార్యుల ద్వైతమతము కర్ణాటకమున వ్యాపించుట

73. హోయసలులు శిల్పకళకు, సంస్కృత, కన్నడ సాహిత్యాలకు చేసిన సేవ

74. **ఆకాంక్ష:-** భరత వాక్యము

శివస్తోత్రాష్టకము

శ్రీ శివపంచాక్షరస్తోత్రము

గద్య

శ్రీ

# గోకులాభ్యుదయము

## అవతారిక

శ్రీ గౌరీసతి పెండ్లి సంబరమునన్ శ్రీకంఠు మూర్ధమ్ముపై
వేగన్ సేసలు వోయువేళ, నచటన్ విన్యస్తయౌ యంగనన్
ఆ గంగన్ గని రోషనేత్రయగు నర్ధాంగిన్ సమీక్షాదృతిన్
గ్రీఁగంటన్నొగిఁగాంచి నవ్వు భవునిన్ గేల్మోడ్చి ప్రార్థించెదన్ 1

సుజనానందకరున్, చతుర్భుజుని యస్తోక ప్రభా భాసురున్,
విజయోద్దాముని సర్వ వంద్యు, సుగుణున్, విఘ్నేశ్వరున్, విష్ణునిన్
గజవక్త్రున్, గణనాయకున్, జయకరున్, గల్యాణ సంధాయకున్
భజియింతున్ కవితా మహత్వ రచనా ప్రాగల్భ్య మర్థించుచున్ 2

పద్మాలయంబున భాసిల్లు జవరాలు!
నక్షర రూపమై యలరు నింతి!
నీరేడు జగముల నేలెడు నెలనాగ!
బాలేందుఁ దాల్చిన పద్మగంధి!
బంగారు వీణియఁబలికించు విరిబోణి
యంచపై విహరించు నలరుబోణి!
నిఖిల భాషల లోన నెగడు చుండెడి లేమ!
ధర్మార్థ గుణములఁ దరలు తరుణి!

పాపహారిణి! గీర్వాణి బ్రహ్మరాణి!
నాశ్రయించెద భక్తితో నాదరింప
లలిత సంగీత సాహిత్య విలసితోక్త
మధుర మంజుల భావ సామ్రాజ్ఞి వాణి! 3

శ్రీలలనా సమేతుని, విశిష్ట వినోదుని, భక్తకోటికిన్
జాల ముదంబుఁగూర్చెడు ప్రశాంతుని, వారిజ నేత్రునిన్, జయో
న్మీలుని, శక్తి యుక్తుని నమేయుని, మాన్యుని, వేదవంద్యు, స
చ్ఛీలుని, విష్ణునిన్ గొలుతుఁ జిత్ర కవిత్వ మహత్వ సిద్ధికై 4

సృష్టికెల్లను మూలమై చెలగువాని,
భారతీదేవి హృదయాబ్జ భానుఁడగుచు
సర్వమున్ దానయై తొలి చదువుఁబలుకు
పద్మ సంభవుఁ బ్రార్థింతుఁ బ్రతిదినంబు 5

శ్లోకాలిర్వదినాల్గు వేలు జగతిన్ శోభిల్లు రామాయణం
బాకాంక్షన్ రచియించి మించి సుకృతానందాత్ముఁడై విశ్రుత
శ్లోకుండై వరదివ్య కావ్యఋషియై స్తోత్రుండునై వెల్గు వా,
ల్మీకిన్ గొల్తు మదాత్మలోన కవితా లీలామృతంబానఁగన్ 6

పంచమ వేదమై జగతి వర్ధిలు సంస్కృత భారతంబు, మే
లెంచి రచించినట్టి సుకవీంద్రు బరాశరనందనున్ ఘనున్
సంచిత పుణ్యునిన్, సకల శాస్త్ర వినిర్మిత కీర్తిసాంద్రు, ధ
ర్మాంచిత సూక్తివైభవుని, వ్యాస మహర్షిని సంస్మరించెదన్ 7

సారస పద్యకావ్యములు సంస్కృత వాణినిఁదీర్చి నిం
పారెడు భావరీతుల ప్రభావపు మాధురిఁబంచిపెట్టి, వి
స్తార యశంబునన్ దనరి సన్నుతిఁగాంచిన కాళిదాసు, నే
వారక నిచ్చలున్ గొలుతు భవ్యకవిత్వ విలాస సిద్ధికై. 8

గద్య నిబద్ధతన్ గమనీయ సత్కృతీ
ప్రాభవు శ్రీభట్ట బాణుఁగొలుతు,
సాహిత్య సామ్రాజ్య సామ్రాట్టు సత్కీర్తిఁ
జెలగినట్టి ప్రవరసేను గొలుతు,
విద్వదౌషధమని వెలయు నైషధకావ్య
మమరంగ వ్రాసిన హర్షుఁగొలుతు,
సారస్వతంబున సత్కవీంద్ర యశమ్ము
రాజిల్లినట్టి మురారిఁ గొలుతు,

భాస భవభూతి భారవి భవ్యకవుల
మాఘ సౌమిల్ల బిల్హణ మల్హణులను
చిత్తమెంతయు రంజిల్లఁజేరి కొలుతు,
వ్రాయుకావ్యాన భావాలు పరుగు లిడగ! 9

వ్యాస రచిత భారతామ్నాయ మంతటి
నాంధ్ర భాషలోన నద్భుతముగ
వ్రాసినట్టి నన్నపార్యుని, దిక్కన,
నెఱ్ఱన, కవుల మది నెంతుఁబ్రీతి! 10

సరస కవిత్వ సంపదను సత్కవి చంద్రులు నిచ్చమెచ్చను
త్తరహరివంశ కావ్యము నుదాత్తముగాఁగయిసేసి, శ్రీ
హరి హర నాథదేవునకు నంకిత మిచ్చిన నాచనాన్వయున్
సరసుని సోమనాధుని ప్రశంసల నెంచెద భావసిద్ధికై 11

బమ్మెర పోతరాజకవి భక్తి రసోజ్జ్వల భావమూని, దై
వమ్ము శరణ్యమంచు జనపాలుర వేడక మోక్షసిద్ధికై
ప్రమ్మిన యాసతోడ మును భాగవతంబు రచించి మించిలో
కమ్మున వెల్గు సత్కవి శిఖామణి కేను నమస్కరించెదన్ 12

బహు శాస్త్రంబుల నేర్చి, భావరసముఁల్ భాసిల్లు సత్కావ్యమున్
మహిలో వ్రాసి, మహీశులిచ్చు ఘన సన్మానంబులన్ బొందియు
త్సహ మొప్పన్ గవిసార్వభౌమ బిరుదున్ ధన్యంబుగా ఁ బొందుచి
న్మహిము న్నీశ్వర భక్తునిన్ గొలుతు శ్రీనాథున్సతమ్మున్మదిన్ 13

పరగు మనుచరిత్రమను ప్రబంధమొకటి
రచన గావించి శ్రీకృష్ణరాయలకిడి
యాంధ్రకవితాపితామహు ఁడనంగ వెలయు
నట్టి పెద్దనార్యుని స్మరియింతు నాత్మలోన 14

హృద్య పద్యమ్ములన్ గూర్చి కృష్ణ చరితఁ
దీర్చి నింపు నింపగఁ గృష్ణదేవరాయ
లంకితమ్ము, గొన్న నాతిమ్మనార్య నెంతుఁ
బారిజాతంపుఁ బరిమళాస్వాదనమున 15

అఖిల శాస్త్రపురాణేతిహాసములు
పుక్కిటం బెట్టుకొన్న మత్పూర్వులందు
నొడినిజేర్చి చెప్పెను నాకు నోనమాలు
తాత 'నాగయా'ఖ్యుని మదిఁదలఁతుభక్తి! 16

పట్టుగ బడిపంతులునై
యెట్టులొ నన్నటులఁదీర్చి యేర్చి చదువులన్
దిట్టగు 'గోపాలు'ని నే
నిట్టుల కవినైనుతింతు నిమ్ముగనాన్నన్! 17

బాధలెంచకుండ పదినెలల్ ననుమోసి
భవమునొసఁగి చన్నుబాల నిచ్చి
పెంచి పెద్దచేసి వెలసిన నామాత
'సుబ్బమాంబ'గొలుతు శుభగచరిత 18

పరమానందమునన్ మదీయ కవితా వ్యాసంగమున్ గాంచి చె
చ్చెరఁబ్రోత్సాహమొసంగి పద్యరచనా శ్రీలన్ ననున్ జేర్చియి
ద్ధరణిన్ గావ్యము వ్రాయఁజేసెగద, ధర్మాత్మునిన్ సద్గురున్
బరగన్ మైనముపాటివంశజుని సుబ్రహ్మణ్యుఁబ్రార్థించెదన్ 19

ఇష్టదేవతా ప్రార్థన మెలమిఁజేసి,
సంస్కృతాంధ్ర కవీంద్రుల స్మరణచేసి
హరికథను 'గోకులాభ్యుదయం' బనంగ
సత్కృతిన్ గూర్చితిన్ జన్మ సార్థకముగ! 20

# ప్రథమాశ్వాసము

శ్రీరమణీయ శుభాకర!
కారుణ్యమనో విహార! కల్మషదూరా!
శ్రీరజతాచలమందిర!
గౌరీ హృదయాబ్జమిహిర! కందర్ప హరా! 1

ముద్దులు మూటగట్టు పదముల్ సవరించి రసోజ్జ్వలంబుగాఁ
బద్దెములల్లు ధీగరిమ భాసిలఁజేయఁగ రమ్ము దేవ! నీ
కుద్దిగ నుండు దేవుఁడిల నుండునె ? భక్తి మదాత్మ నెక్కొనన్
బెద్దవు నిన్నువేడెదను, పేర్మినిఁబ్రోవుము పార్వతీశ్వరా! 2

అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్చు · గోకులాభ్యుదయం
బునకుఁగథా క్రమవిధానం బెఱింగించెద 3

## యయాతి చరిత్రము

జన రంజనుఁడు పరీక్షి
జ్జన పాలుఁడు శుకమునీంద్రు జయగుణ సాంద్రున్
గని యదువంశ చరి
త్రను దెల్పుఁడటంచుఁగోరి తగఁబ్రార్థింపన్ 4

అనవుడు మౌనీంద్రుం డి
ట్లను జనవర! నీవు కోరినట్టి చరిత్రం
బనుపమ పుణ్యాధారము
వినుమని చెప్పన్ దొడంగె విస్ఫుట ఫణితిన్ 5

చంద్ర వంశమునందు జన్మించి ధా
        త్రీపాలకుండైన దివ్యమూర్తి!
క్రతు శతంబొనరించి యతులితుండై యింద్ర
        పదవిని గైకొన్న భవ్యమూర్తి!
నహుషభూపతికి ధీమహితులు యతియు, య
        యాతి, సంయాతి, అయతి, నియతి
కృతి, యను నార్వురు సుతులుద్భవించిరి,
        వారలలోఁ బెద్దవాఁడగు యతి
గాఢవైరాగ్యుఁడై రాజ్యకాంక్ష వీడె
నంతట, ద్వితీయుఁడైన యయాతి రాజు
రాజ్యమున్ గొని వర్ణ ధర్మములఁనెంచి
చక్కగా ఁబరిపాలన జరుపు చుండె. 6

దివిజులు దితిజులు పగతో
బవరము సేయు తఱి శిష్యపక్షపాతుల భా
ర్గవుఁడు బ్రతికించుచున్ మును
సువిచారుండై వసించె సుఖముగ నిష్ఠన్. 7

అటువంటి యదనులోపలఁ
గటకటఁబడి దేవతతులు కంపిత మతులై
పటుతర చింతావృతులై
యిటు లాలోచించి రెలమి నీప్సిత మొప్పన్ 8

దితిజుల్ కయ్యమునన్ గతించి మరలౕ దేహంబులన్ దాల్చుటౕ
మృతసంజీవని కారణంబు మనకీమేల్ గూర్చు పుణ్యప్రకా
శితులీ పట్టణ మందులేరు, విజయశ్రీ రాదు, తద్విద్యనే
ర్చు తటస్థుండు దయార్ద్రవుండు కచుఁడంచూహించి రస్వప్నకుల్. 9

త్రిదశుల కోర్కెతోఁగచుఁడు ధీరతఁ గావ్యుని కాప్త శిష్యుఁడై
వదలక భక్తి సేవనల వర్తిలుచున్ మరి దేవయానికిన్
విదిత విధేయుఁడై సతముఁ బ్రీతిని గూర్చుచు దైత్యకోటికిన్
బెదరక చాలకాలము నభీష్టముఁ గోరుచు వేచియుండఁగన్ 10

దనుజులు కచుఁజంపి దహిం
చిన భస్మకలుషిత మద్యసేవ వలన ధీ
ఘనుఁ డుశనుఁడు కచునకునే
ర్పెను 'మృత సంజీవని ' యను విద్య క్రమమునన్ 11

తనగృహంబున కేగఁదలచిన కచునకు
గురుఁడనుమతి నిచ్చె, గురుతనూజ
యనుమతింపక వివాహాపేక్ష నెఱిగించెఁ
గచు ననాదరమునఁగనలి యామె
నీకు నాజనకుండు నేర్పిన సద్విద్య
పనిచేయ కుండెడునని శపించె;
నాగ్రహంబున ఁగచుండావిద్య నాచేతఁ
గొన్నవానికి మేలుఁ గూర్చుననియు
శాపమును ద్రిప్పుకొని, యగ్రజన్ముఁడింక
నిన్ను సతిగా వరింప, డీనియతి జరుగు
ననుచుఁ బ్రతిశాపమును దేవయాని కిచ్చి
కచుఁడు స్వేచ్ఛగా దేవలోకంబు జనియె. 12

మున్ను వృషపర్వుఁగూతురు పువ్వుబోణి
నతుల రూపాఢ్య శర్మిష్ఠ ననుసరించి
చెలియ లెల్లరు భార్గవి ఁజేరి నడువఁ
గొలను జేరిరి, మదిలోనఁగోర్కెలలర! 13

మధుపంబు లొకవంక మకరందముల నాని
        మనసార ఝుంకృత ధ్వనులు నెఱప,
కనువిందు గలిగించు కమలషండంబుల
        గంధమ్ముగ్ దిశల్ గ్రమ్ముకొనఁగ,
మామిడి చిపురుల మత్తుగా మెసవిన
        కోయిలల్ తీయని కూతలిడఁగ,
మహనీయ ఫలవృక్ష మండల మెల్లెడఁ
        జచల్లని నీడలన్ శ్రాంతి దీర్ప,
నమల మానంద మాత్మల నావరింప
జిలుగు వెలుగుల వలువల వెలియ నూడ్చి
కొలను వడిఁజొచ్చి నీటి యలలఁదమిని
జల్లు లాటల నాడెడు సమయమందు. 14

ఒక్క సుడిగాలి వీతెంచె, నొడ్డుమీద
నున్న పుట్టంబులన్నియు నొక్కటొకటి
తారు మారులై గలసినన్ దరుణు లెల్లఁ
గొలను వెల్వడి ధరియింప వలువలపుడు. 15

త్వరపడి యాశర్మిష్టయుఁ
బొరపాటున శుక్రుఁబుత్రి పుట్టము గట్టెన్
గరముఁగుపితయై కని యా
హరిణాక్షినిఁ బల్కె దేవయాని యిటువడిన్ 16

మీ వంశంబునకున్ గురుండు బుధ సన్మిత్రుండు నిష్ఠాగుణ
ప్రావీ ణ్యుండగు కావ్యుఁబుత్రికను శుంభద్వేద మార్గంబున్
దైవత్వ ప్రతిభా ప్రభావ మహితన్, ధర్మప్రకాశోన్నతిన్
నావస్త్రంబులు నీవుఁగట్ట దగునా ? నానింత లేకుండగన్ 17

భూసుర వంశంబున నే
భాసురముగఁ బుట్టినాను, పావనయుతమౌ
భూసుర రమణుల వలువల
నోసీ! పెరవారు ముట్టనొప్పునె? చెపుమా! 18

నాడు తండ్రిని గురువుగా నాడు తలఁచి
పిన్న తనమున నీ తండ్రి విద్య నేర్చె,
కాని, యాకృతజ్ఞతవీడి కావరమునఁ
జెటుఁజేసెదవేలకో సిగ్గు విడిచి? 19

అన, శర్మిష్ఠయు నెఱుపున్
గనుదోయినిఁదోప, రోష కంపిత మతియై
తన కటితట మదరంగాఁ
బెను బిఢ్గులు రాలినట్లు ఁబ్రేలెన్ బెలుచున్. 20

అనవరతము నీ జనకుఁడు
మన మారఁగ సేవలిడుచు మాదాక్షిణ్యం
బున జీవించుటలేదా?
యొనరఁ నీ గొప్ప యెద్ది ? యూహించినచో! 21

రాజచంద్రుని పట్టినై మోజు మీర
సౌఖ్యసంపత్తులందెడి చాన నేను,
నీవు విప్రుని పుత్రివై నీల్గెదేల ?
గర్వపడినంత మాత్రానఁగల దెసుఖము? 22

అని తన గొప్పఁజాటి, కను లగ్ని కణంబులు నేలరాల,సం
జనిత మహోద్ధతిన్ మిగుల స్వాంతము నెట్టన ఁదొందరింప యో
చన యిసుమింతలేక పటు సాహస మొప్పఁగ నెంచె, దేవయా
నిని విడువంగ రాదనెడి నిశ్చయ కార్యవిధానమున్ త్వరన్ 23

బోట్ల నాజ్ఞఁబంచి పొదువంగఁబట్టించి,
దర్ప ఛాయలొప్ప దనుజసూతి;
పాడు బావిలోన భార్గవి ఁద్రోపించె
కినుక లోన కన్నె కృపను కనునె? 24

## మల్లికా వృత్తము

పంతముఁ గెల్చిన ప్రాబల్యమునన్
సుంతయుఁ జింతయు జూపింపకయే
యంతర మెంచక నానందమునన్
శాంత మనంబున శర్మిష్ఠ చనెన్. 25

వెంట వచ్చిన వారలు విడిచిపోవ
శిరముఁ బైకెత్తి చూచుచు శిక్షయంచు,
పాడు బావిని తీవలఁబట్టు కొనుచు
నేడ్వసాగెను భార్గవి యెట్టులనుచు. 26

ఎవరిన్ జీరుదు? నెవ్వరిన్ దలఁతునో? యెవ్వారి నాశించెదో?
యెవరిన్ వేడెద ? నెవ్వరిన్ గొలుతునో? యెద్దేవు నర్థింతునో ?
యెవరిన్ దాపముఁ బాపుమా యనుచు నేనిచ్చో మొఱన్ బెట్టెదో?
ధ్రువమౌ కీరితి మాసిపోయినది, నారోషాగ్ని నన్నే చఁగన్ 27

రాక్షస రాజ పుత్రికను రమ్మని పిల్చితినేల ? పిల్చినన్
తక్షణ మేలవచ్చినది? తప్పక వచ్చె, మఱిన్ మఱిన్ మదిన్
గక్షలుఁగల్గనేమిటికి ? కల్గెనుబో, నను బాడు బావిలో
దక్షతఁద్రోయనేమిటికి ? తన్వి ప్రకోపము హానిఁగూర్పదే? 28

దనుజ కోటికి గురునౌచుఁదనరు శుక్రుఁ
బుత్రిక నయి, నే బాధలఁబొంద నేల?
విధి యలంఘ్య మటంచను విధముఁదోచె,
స్వానుభవ మొండు నజ్ఞతన్ సంస్కరించు 29

అనలము సోకిన యంతటఁ
గనకము వర్ణంబు మారుకరణిని, యాకా
వ్యుని పుత్రిక యటఁదలపఁగ
మనమున శోకాగ్ని రగిలి మలినముఁగాగన్ 30

**పంచపాది :-**

ఘన మందార లవంగలుంగ కదళీ ఖర్జూర నారింజ చం
దన పున్నాగ రసాల సాల బదరి తక్కోల హింతాల కాం
చన చండాత మశోక నాగ సురభిజంభీర భూజావళుల్
అనువౌ ఖడ్గ వరాహ నాగ చమరీ హర్యక్ష శార్దూలముల్
గనుచుఁరా, నడవిన్ యయాతి మృగవర్గంబుఁవడిఁ ద్రుంచుచుఁ 31

అంతట దేవయాని చటులంబగు శోక దవానలంబుచే
గొంతును బొంగురఁ బడఁగ గొల్లున నేడ్చుచు నుండ నూతిలో
వింతగ నా యయాతి విని విస్మయ చిత్త విచారమొప్ప నే
కాంత విషాద నాదమది? కాంచెదఁగాచెద సాయ మిచ్చెదన్. 32

అనుకొని తాఁజని నూతిని
ఘనలత హస్తాన నూని కనలు వివస్త్రన్
గని, వస్త్ర యుతన్ జేసియు
మనిచెన్ గుడిచేయిఁబట్టి మాన్యుఁడు సుదతిన్, 33

తదుపరి భార్గవి కించుక
హృదయంబున శాంతి చేర, నేపగుప్రీడా
స్పదమయి బహురీతులనటఁ
గదలక యోచించె నవని గాంతుని యెదుటఁ 34

కరుణా సింధుఁడు నిందిరాప్రియుఁడొ ! శ్రీకంఠుండొ! శీతాంశుడో!
వరనారీ హృదయానురంజనుఁడునౌ వాసంతుఁడో! కంతుఁడో!
సురలోకేంద్రుడొ! కాక తత్సుతుఁడొ! శోకంబుఁబాపంగ ని
ర్ధర కేతెంచిన ప్రాణవల్లభుఁడొ! నేతర్కింప నేమౌనొకో! 35

ఆత్మ సంక్షోభ భరితమ్మై యట్టు లిట్టు
లూగ, మాటైన రాకుండ మూఁగ వోయి
శిల్పి మలచిన బొమ్మనఁజేడె నిలచె;
నంత భూపతి ప్రశ్నించె నామె నిట్లు. 36

కాంతా! నీ వెవ్వరవీ
కాంతారమునకు వచ్చు కారణ మేమో?
వింతగ నీసూతిన్ బడి
చింతలఁగా నేమి ? యనెడు క్షితిపతి తోడన్. 37

అనఘా! శుక్రుని పుత్రికన్ వన విహారార్థంబు విచ్చేసి యి
వ్వన భూమిన్ దిరుగాడు చుండి యెటులో హాలారు మార్గంబు ద
ప్పిన నేనై వడినూతిలో ఁబడితిఁబ్రావీణ్యంబు నౌ వంశమున్
విన నూటెడె మదీయ మానసము, నీ వృత్తాంతమున్ దెల్పుమా. 38

చాన! చంద్ర వంశమ్మునన్ జనన మంది
చక్ర వర్తిగ రాజిల్లి జగతిలోన
ఖ్యాతిఁగాంచిన నహుషుని యనుఁగు సుతుఁడ
నవనిఁబాలించు వాఁడ యయాతి విభుఁడ! 39

అని ధాత్రీశుండెలమిన్
దన వంశక్రమము నుడివి తదుపరి తాఁ
జనియెన్ నిజపురమునకున్
మనమున సంతోషమెల్ల మలయుచు నుండన్ 40

అంత భార్గవి పట్టణ ప్రాంతమునకుఁ
జేర 'ఘూర్ణిక' కనుపింపఁజెలియఁజేరి
గతము నంతట వినిపింపఁ గడగి యామె
దైత్య గురువున కది చెప్పెఁదడయ కపుడు. 41

అనవుడు శుక్రుఁడు హృదిలో
ఘన సంతాపంబునొంది కటకట పడుచున్
దన కూతురున్న చోటికి
జనియెన్ వాత్సల్య గరిమ సంతసమీయన్. 42

కోపోద్దీపిత నేత్ర వీక్షణముతోఁగ్రోధంబుతో ఁజింతతో,
నాపన్ శక్యముగాని బాష్పములతో, నావేదనోద్భ్రాంతితో,
నేపారన్ జనియించు క్రొంజెమటతో, నీర్ష్యప్రభావంబుతో,
నాపూర్ణంబగు కన్నియన్ గనుచు శుక్రాచార్యుఁడా పుత్రితో. 43

అమ్మా! యుమ్మలికంబు నీపగిది యింతన్ బొందఁగా నేల! ధై
ర్యమ్మున్ బూనుము, నాపదన్ గనకుమా, రారమ్మువేవేగ, లో
కమ్మందేయెడ హానివృద్ధులును రాకన్ మాన వోపుత్రి! కా
ర్యమ్మున్ సాధనఁజేయుటొక్కటియె యోగ్యంబౌను యోచింపఁగన్. 44

పరగ యజ్ఞ శతముఁజేయు ప్రభువుకంటె
కోప హీనుండు ఘనుఁడనఁగోచరించుఁ
గాన, శర్మిష్ఠ చిన్నది, కరుణ తోడఁ
గావ రావమ్మ! కష నాగ్రహము, నుడిగి 45

కనకన మండుచున్న శిఖిఁగాంచుచు నాజ్యము వోసినట్లు, శు
క్రుని హితబోధలన్నియట రోషముఁబెంచుచు నింపెఁ గీలలన్
అనియతమ్మైన చిత్తమున నల్లటమొందిన యంత నామెలో
మననము లేమి క్రోధమున మార్కొని బల్కెను తండ్రి నొవ్వఁగన్ 46

భూసుర వంశమంతయు విభూతి నశించెడి రీతి నన్ను పె
న్నీసున నుద్ధతిన్ దనరి నెట్టనఁజెట్టను జేయనేల ? సం
త్రాసముఁజేయనేల ? యటదానవనాథుని కూతురుండ నే
యాసఁబురంబు జొచ్చెద ? మదాత్మకు నీవిటు నీతిబల్కెదే? 47

అని పౌరుష వాగ్జాలము
వినఁబల్కెడు దేవయాని వేగిరి పాటొం
దిన గతి శుక్రుండారసి
యనువుగ ఁదానిట్లు పల్కె నావేదనతో 48

అమ్మా! వచ్చెద నడువుము
సమ్మతి లేనట్టి చోట సాగవు బ్రతుకుల్
లెమ్మా కోరిక దీర్చెదఁ
గొమ్మా నామాట, నెచటికో పోదములే, 49

ముందు వెన్కల వారలుఁబురము వీడి
వెళ్లుచుండినఁ వేగులా విషయమెరిగి
దనుజనాధున కెఱిగింప ★ ద్రవిణ మెల్ల
గోలు పడువాని చందానఁగుందునంది 50

సమరంబందు నిశాచరుల్ మడిసినఁ సంజీవనీ విద్యచేఁ
బ్రమదోత్సాహములొప్పఁగావ్యుఁడు వడిన్ బ్రాణంబులన్ వారికిన్
సమకూర్చున్ గద, యాతఁడే యరిగినన్ సామ్రాజ్య సంవృద్ధికిఁ
గ్రమముఁ క్షీణముఁగాంచునింక నతనిన్ రమ్మంచు నే వేడెదన్. 51

అని మది, మెదలెడు భావం
బున నంతఃపురము వీడి భూపతి వడిగా
దనుజాచార్యుని కడకున్
జని పాదాక్రాంతుఁడగుచు సమ్మతిఁబల్కెన్ 52

అనఘా! నీ విటు కినుకన్
జనుటకుఁగారణ మదేమొ! చయ్యన నాకున్
వినిపింపుము, నీ యాజ్ఞను
మన మారఁగఁజేయువాఁడ మాన్యచరిత్రా! 53

అని శుక్రాచార్యుని ఁదాఁ
గొని యాడిన నతఁడు ననియెఁగోపోద్వృత్తిఁ
ఘనమగు వ్రేటున్ బొందిన
పెనుబాము విధాన రోష భీషణ భాషన్. 54

---

★ ద్రవిణము = ధనము, బంగారు

నీదు హితంబు లెస్సయని నేను దలంచితి, నేడుఁజూడఁగా
నీదు కుమారి మాయెడల నీచపు బుద్ధిని దేవయానిపై
నాదర మింత లేని యది హంతకి నూతినిఁద్రోయుటేలకో ?
ఓ దనుజేశ! యింతటి యనౌచిత కార్యము నీవు వింటివే? 55

చెలులున్ వేవురఁగూడి నీదు సుతయున్ శీఘ్రంబుగా దాసియై
చెలువారంగ మదీయ పుత్రికకు సత్సేవల్ సదా చేసినఁ
గలతన్ మానెద; నావుడా నృపతి వేగన్ బుత్రికారత్నమున్
జెలులన్ బిల్చియుఁగొల్వగాఁబనిచె నా సీమంతినిన్ భార్గవిన్. 56

అమితోష్ణంబును వీడి జీవతతికిన్ హాయిన్ బ్రసాదించు భా
వమునన్ భానుఁడు పశ్చిమాంబుధిని నిర్వర్ణుండునై గ్రుంకుచో
నమరెన్ గన్నుల విందుగా నపుడు సంధ్యారాగ పుంజంబులున్
రమణీయంబగు పైడి కాంతులనఁగా రాజిల్లె నా దిక్కునన్. 57

కాలమను వేటగాఁడట ఖడ్గమూని
జంతుచయముల కుత్తుకల్ చాలఁగోసి
వాటి రక్తంబుఁబట్టియుఁ బశ్చిమాద్రి
పైనఁ జల్లెనో యన సంధ్య పరిఢవిల్లె! 58

కడఁగి ద్యుమణి ఘోటకములఁ బూన్చిరథముఁ
దోలు చుండ నవియుఁ దొలగ కుండఁ
బశ్చిమాద్రిఁ దగులఁ బాయలందెగొసిన
మణుల కాంతి యనఁగ మణఁగె సంధ్య! 59

పక్షులన్నియుఁ దమగూళ్ళవైపుఁబాఱె
పశుగణంబులు నిండ్లకు వచ్చి చేరె
పనులు విడనాడి కర్షకుల్ వచ్చిరిండ్లుఁ
జేర, భానుఁడు క్రుంకెడు చిన్నెలెటిఁగి 60

దినకరుఁడా యపరాంబుధి
మునుగన్ దిమిరమ్ము హెచ్చె భూవలయంబం
దున; కంజమ్ములు ముకుళిం
చెను; చోరుల కుత్సుకతయుఁజేకూరె హృదిన్ 61

**చంద్రకళావృత్తము**

ఆకసంబున శీతకరుండంతంతకు నెక్కుచుఁజంద్రికల్
వీఁకమై దివిపై వెదజల్లన్, వేడుకలొప్ప చకోరముల్
లౌకికంబన వాని నటన్నుల్లాసమునన్ దగ నానుచున్
కూక లెట్టుచు నిక్కుచు గుంపుల్ గుంపులుఁగూడుచునాడుచున్ 62

మాజాబిలి మా శ్రీయని
మాజేజేయని గురుఁడని, మావిభునకు మా
జేజేలని యవి,గుల్కెన్
యాజైత్రుని కళలవలన నాహ్లాదమునన్. 63

తారాచంద్రుల భార్గవి
తారాపథమందుఁగాంచఁదన కనులెదుటన్
కోరిన యయాతి నరపతి
మారుండయి మరులు గొల్ప మఱి మఱి మదిలో! 64

గురుసుత దేవయాని జనకున్ గని యిట్లనె, నంత నన్ను సా
దరుఁడయి నూతినుండి శుభదంబుగ హస్తముఁబట్టి గట్టుకున్
ద్వరపడి చేర్చి మానమును బ్రాణముఁగాచిన యా యయాతి భూ
వరుని వివాహమాడుటకు వాంఛితనైతి ననుగ్రహింపుమా! 65

అనవిని శుక్రుఁడనూహ్యావ
చనము దుహిత వలన నెఱిగి సాదర భావ
మ్మున ఁబ్రా జదువుల సార
మ్మను బ్రాహ్మణ్య మహిమ బోధన సేయన్ 66

విని, దేవయాని యిటులనె
జనకా! నీవెఱుగ రాని శాస్త్రము కలదే?
మనమున నాటిన మమతను
బెనుదూరముఁజేయఁదగునె వెలదికి నెందుౕ 67

అని పలు విధముల భార్గవి
జనకుని నొప్పించె; నంత స్వాగత మంపెన్
దనుజాచార్యుండట యయా
తిని రమ్మని మనసులోనఁదెలిసిన రీతిన్ 68

ప్రాగ్దిశా భామినీ ఫాలంబు నందునఁ
జెలువొందు సిందూర తిలకమనఁగ!
నుదయాచలంబున ముదమొప్ప తలమించు
ఘుస్పృణ సుమలతా నికుంజమనఁగ
కాల సత్పురుషుఁడు కైసేసి కరమునఁ
గడఁగి తాల్చిన పైడి ఘంట యనఁగ!
జంద్రునోటమిఁజాట సంబరంబున దిన
కాంత పట్టిన కాంతి కలశ మనఁగ!

గగన మండల సురదీప కళిక యనఁగ!
పద్మినీ కాంత జపముల ఫలమనంగ!
ముగురు మూర్తుల రూపాల ముద్దయనంగ!
భాను బింబంబు ఁదోచె జంభారి దిశను. 69

మంగళానందవాద్యముల్ మ్రోఁగ మ్రోల
నా యయాతి బాంధవ మిత్రు లార్యు లాది
గా వివాహోత్సవమునకుఁగదలివచ్చె
సకల సామంత రాజ్య ప్రజాళి తోడ! 70

అట సబాంధవమ్ముగను దైత్యకుల విబుఁడు
రాగ, భార్గవీ పరిణయ క్రమముఁదెల్పెఁ
గవియుఁబంచాంగ శుద్ధిగాఁగాలమహిమ
నెంచి మూర్తమ్ము సర్వమ్ము నేర్పరించె. 71

బ్రాహ్మణోచిత పద్ధతి, రాజనీతి,
వేద సంయుక్తగతుల సంవేద్య ఫణితిఁ,
గూర్చి కల్యాణ కల్పంబుఁదీర్చి, చేసె
భార్గవీ యయాతీశుల పరిణయమ్ము! 72

పెద్దలున్ బుషిగణము సంప్రీతిఁజెంద
దేవతా నిహవమ్ము వధూవరులకు
నాయు రారోగ్య భోగ భాగ్యాలుఁగల్గ
సతము దీవించి నారక్షతలు జల్లి! 73

ఒద్దికఁ గల్గి భర్తయెడ యోగ్యత నిల్పుము, యత్తమామలన్
బెద్దలఁబూజసేయుము; సుహృత్తతిఁబ్రోవుము, బీదసాదలన్
దద్దయు నాదరింపుమని దైత్యగురుండు హితప్రబోధుఁడై
ముద్దుగ ఁబల్కుచున్ బయనముఁ సమకూరిచి పంపెఁబుత్రికన్ 74

పితరు నాజ్ఞను శర్మిష్ఠ వెంట వచ్చు
పరిజన సహస్ర సహితయై తరలె, గురు సు
తానుగామియై, తా హృదయవ్యధార్తి
దాచి కన్నీట మ్రొక్కుచు ధర్మవిధిని! 75

పరమ సుఖాబ్ధి డోలికలఁ బన్నుగ నూగుచు నాయయాతి సం
బరమున జీవితంబు గడుపన్ దగియుండెడు కాల మందునఁ
నిరుపమ రూప యౌవనము నేర్పున నా వృషపర్వు కూతురున్
బరువడి వారి యూడిగమె భావ్యమటంచు ఁదలంచి చేయఁగన్ 76

ముదమగు దాంపత్యంబున
నుదయించిరి దేవయాని కుతుకం బలరఁ
యదు తుర్వసులను కొమరులు
యదుకుల సంవ్యాప్తికెల్ల నారంభమునన్! 77

ఊడిగంబుఁజేయు చుండెడి శర్మిష్ఠ
దేవయాని సంతుఁదేరి చూచి
యాత్మలోన నిటుల నాలోచనముఁజేసి
కన్నెబ్రతుకు సార్థకంబు నగునె? 78

కోరిన భర్తను బొందెన్
గూరిమితో దేవయాని కొమరులఁబడసెన్
బేరొందు సుతులు గలసతియె
ధారుణిలో ధన్యురాలు, ధర్మముఁదెలియన్ 79

**ధ్రువకోకిలము.**

అతుల సోయగమేనుగాంచితి, నైన నెందుకు కానలో
నతకరించిన పుష్పమాయె, మదాత్మ చింతిల నేమి యా
వెతల మాన్పెడి భర్తలేమిని వేడుకేదియు రాదిలన్
పతినిఁ బొందిన లేమ గొప్పది భాగ్యమూర్తియె ధారుణిన్ 80

అట్టే వృష పర్వుని సుత
నిట్టులపు వియోగ బాధ నెక్కొన సతమిం
కెట్టుల నెండెడు మ్రోడై
నెట్టింతును జీవితమని నిర్వృతి నుండన్ 81

**వసంత తిలకవృత్తం.**

వ్యాకీర్ణతా తపములంతటఁ జెల్లిపోయెఁ
భూకాంత పుష్పాదుల భూషితయై చెలంగన్
సౌకర్యమై కుసుమసౌరభమల్లవీవఁ
వీఁకన్ వసంతమిల వేడుక నీయ వచ్చెఁ! 82

అలరె వసంత మంతట లతాంత మరంద వినోద షట్పదా
విలసిత భావ ఝుంకృతుల, విస్తృత పుష్పసుగంధ సౌష్ఠవ
మ్ముల, నవ పల్లవ గ్రసన భూతిఁ బికావళులెల్లఁ బొంగుచున్
గొలిచెడు రాగగీతముల, కొల్పున వీచెను పిల్లగాలులై 83

క్రమమున కార్యభారమునఁగాసిలిఁ జెంది యయాతి యత్తఱిన్
సుమములచే రహించెడు యశోక వనంబును గాంచు నిచ్చతో
నమరిన పూఁబొదన్గనె సురాంగనఁబోలు శుభాంగిజవ్వనిఁ
సమయము కోస మెంచిన ప్రసన్నమతిన్ దనుజేశుఁ బుత్రికన్ 84

కాంతను గాంచినంత రతి కాంతుఁడు పుష్పశరంబులేయ భూ
కాంతుఁడు తత్తరించునెడ కామము హెచ్చుగ బైకొనన్ వడిన్
సుంతయు భావి సంస్థితిని చొప్పరికింపక సౌఖ్య మెంచుచున్
జెంతకు జేరె నిగ్రహము చేపడి చిత్తము సన్నగిల్లుటన్. 85

ఓయెలనాగ! నిన్నుఁగన నుల్లము నూఁగి సుమా స్త్రకోలలన్
గాయము గాయమయ్యె, నికఁ దాళగఁజాల మరెన్నిరీతులన్
నీ యనుకూలమొక్కటియె యేడ్తెర నాకు శరణ్య మౌను, నీ
వే యనుమానమున్ గొనక వేచక నన్ను బరిగ్రహింపుమా! 86

అనవిని యాలతాంగి మనమందున గౌతుక భావ మొప్పనా
య్యన విభుకౌఁగిలిన్ దగిలి యంచిత భక్తినిఁబల్కె నిట్టులో
జనవర! నీదు కోర్కెనిట సమ్మతితో నెరవేర్చు దాననై
నను, భవదీయ భార్య వలనన్ సమకూరవె కష్ట నష్టముల్? 87

అనవుడు నా ప్రభుఁడతిశయంబగు ప్రేమభరంబుతోడ నా
య్యనఁ దనుజేశుపుత్రికను యంకముపైనిడి బుజ్జగించి, యా
ననియె, మనః ప్రకార విధి యందలి తత్వము బోధచేయుచున్
దనుజతనూజ సమ్మతిని దన్ప రహస్యము నెంచు రీతితోఁ 88

అష్టవిధ వివాహక్రమ మందు నొక్క-
విధము గాంధర్వ మెన్నఁగా వెలయు మిన్న
యంద్రు కోవిదులు, కనుక నట్లు ఁజేయఁ
గష్ట నష్టాలుఁగల్గ నే ననుభవింతు 89

అనెడు నవనీశుఁ బలుకుల నవధరించి
యించుకఁ జలించియున్ దనుజేంద్రసుతయు
నా యయాతి కౌగిళ్లలో నడఁగి కంతు
సంగతుల కరఁగెఁ బ్రథమ సంగమమున! 90

ప్రమదానుకూల దాంప
త్యమునన్ ద్రుహ్యాను బూరులనఁబడు సుతులన్
గ్రమతన్ శర్మిష్ఠ కనె; భా
వము రంజిల్లన్ యయాతి వలనన్ బ్రీతిన్ 91

## ధ్రువకోకిల వృత్తము :

దనుజనాథుఁదనూజ యంత ముదంబు మీర దనూజులన్
గనుటెఱింగిన శుక్రుఁబుత్రిక గాసినంది హుటాహుటిన్
దనదు చెంతకు నామెఁ బిల్వగఁదా నుదారతన్ భార్గవీ
మనము నందలి తత్వమంత సమర్థ మొప్పనెదుర్కొనఁ 92

ఆపదం దబద్ధంబు సాయమగుననెడు
శుక్రుఁబద్ధతిఁ దలఁచి విశుద్ధరీతిఁ
బలికె నిట్లు శర్మిష్ఠ స్వభావ మెడల
నిర్భయాన గురుసుతతో నేర్పు వెలయ 93

అఖిల వేద వేదాంగము లందు నేర్పుఁ
గన్న ఋషివర్యుఁడొక్కండు కరుణ తోడ
ఋతుమతియగు నన్ గాంచి తానిష్టపడియు
పుత్ర దానంబు గావించెఁబువ్వు బోణి! 94

అనవిని శుక్రుని పుత్రిక
మనమున కోపంబుఁ బాసి మగుడన్ బ్రశ్నన్
దనరన్ వేయక నుండన్.
దనుజేశుని పుత్రి యరిగెఁ దన గీమునకున్. 95

'రంకు బొంకు దాఁ' గదను దెఱఁగున దేవ
యాని యుపవనంబున నాడె ఁడసుర పుత్రి
సుతులఁగాంచి భర్త్రు ముఖంపు సూచనల నొ
గిన్ గని మగని నిజము నెఱిగింపు మనియె 96

సత్య వచనుఁ డయ్యు యయాతి సంశయాత్ముఁ
డై పలుకకున్న మౌన మొక్కఁండు తెల్పు;
నంచు నంగీకృతంబు నయ్యతివ మిన్న
తండ్రి కా విషయముఁ జెప్పఁ దలఁచి యున్న 97

మనుజేశుండగు నా యయాతి సతినిన్ మన్నింపఁగా వేడినన్
గనులన్ గోపము నింపి తీవ్రమగు కాకన్ గ్రుద్ధ సర్పంబటుల్
ఘన నిశ్వాసములన్ నిగుడ్చుచుఁబ్రసంగౌచిత్యమున్ లేక నొ
య్యన మాటాడెను దేవయాని పటువాక్యశ్రేణి జృంభింపగన్ 98

**మనోజ్ఞ.**
అమిత శుభంబగు కార్యమంతటఁ జేయకన్
గౌమరు వయస్సు చలింపఁ గోర్కెలు మించినన్
భ్రమసి వరించియు వేరు భామినిఁ గూడి స
క్రమముఁ దొలంగిన భర్తఁగాంచి సహించునే. 99

ధనమిచ్చియుఁ బోవిడచిన
మనుజేశుని నమ్మవచ్చు మానుగ మహిలో
గనుజాటునఁ బరకాంతకు
మనసిచ్చిన వాని నమ్ము మగువలు గలరే? 100

**భుజంగప్రయాతము :**
వివాహాన నన్బొందు వేళన్ వినీతిన్
శివాధీన బుద్ధిన్ బ్రసిద్ధంబుగా గన్
భువిన్ నేఁ బర స్త్రీల ఁబోనంచు నాడున్
జవాబిచ్చి యిట్టేల సాధింతు వౌరా! 101

నిన్ను మన్నించఁ జాలను, నేరమెంచి
నాదు తండ్రియె తగినట్లు న్యాయబుద్ధిఁ
దనర దండింప నర్హుండు ధరణిలోనఁ
గాలు కాలిన వారికిన్ కలుగు బాధ. 102

అని భార్గవు యంతటఁ దం
భనమున శాంతంబులేమి భార్గవున కదె
ల్లిను తెలుపన్ బూనినదై
చనియెడు సమయమ్ములోన జగతిట్లుండెన్. 103

గిరులన్ గత్తృణ మెండె జంతువులు శుష్కించెన్ జలాభావముఁ
ఝురులం దెల్లెడగానుపించెఁ నటు జాజ్వల్యంబు దావాగ్నివై
ఖరి దోతెంచెను, మండుటెండలకు సుగ్గిపోయె సస్యాళి యే
గిరి క్షుత్పీడితు లన్యదేశములకున్, గీష్మమ్ము తీంఁడ్రింపగన్. 104

అన్నమొ రామచంద్ర యని యాచక వర్గము లార్తి నందఁగన్
ఎన్నడులేని యెండలు మహిన్ విపరీతము లయ్యెనంచురై
తన్నలు బాధలన్ బడఁగ నాకసమందున మబ్బులేక పోఁ
ఖిన్న మనస్కులౌ ప్రజకు గ్రీష్మము భీష్మము నయ్యెనయ్యెడఁ 105

ప్రాణి కోటికి దప్పిక ప్రజ్వరిల్ల
బాట సారుల హృదయాల బాధలమ
పసుల కాపర్లు మడుగులన్ బడఁగ బడలి
ప్రబలె; వైశ్వానరశిఖలు వసుధ యందు 106

## సుగంధి వృత్తము

అట్టి గీష్మ మట్టు నామె యాననంబు వేడిగాఁ
జుట్టుకొన్న కోప వహ్ని చూపులందుఁ జుట్టగాన్
బట్టినట్టి పంత మంతమైల చీర చాటగాఁ
జెట్టఁ జేయఁబూని తండ్రిఁజేరి పల్కె నివ్విధిన్ 107

జనకా! యేమని చెప్పగాఁ దలఁతు నీ సామ్రాజ్య పాలుండు క్ర
వ్వున శర్మిష్ఠను గాంచి ప్రేమనిడి య న్యాయంబుఁజేకూర్చి నా
మనమందగ్ని జనింపఁజేసెఁనిటు, నేప్రాణంబులన్ వీడకన్
నిను దర్శింపఁగ నిచ్చవచ్చితిని, నన్నీవిప్డు రక్షింపుమా! 108

అంతట భార్గవుండు తనయాత్మజ నేత్ర కవోష్ణ బాష్పముల్
చింతిత మానసుండగుచు చేతుల (దుడ్చుచు(జెంత నున్న భూ
కాంతుని ద్రోహమున్ దల(చి క్రమ్మిన కోపము తోడ(బల్కె, మా
కింతలు(జేయ నూఱక వచింపగనేల? ఫలంబు( బొందుమా! 109

యౌవన ముడి(గి జరాభా
రావహు(డవగుము, నిరతము రమణులు(దానన్
భూవల్లభ! నిను( గోరరు
నావచనముల కెపుడున్ వినాశన మున్నే? 110

అని శాపము(దా నొస(గన్
జననాథున కంత(గల్గె( జకితపు జరయున్
గనులన్ బాష్పము లొలుకన్
దనుజాచార్యునకు( దెల్పె(దడయక నిటులన్ 111

**స్రగ్విణి :**
యౌవనాపేక్ష నాయందు( జెన్నార, నన్
బ్రోవకన్ శాపమున్ ముట్టుపాటొంద(గన్
ధీవరా! యిచ్చినన్ దృష్టి నన్ జేరునా?
కావునన్ వృద్ధతన్ గ్రక్కునన్ మాన్పుమా! 112

అని బహు విధముల శుక్రుని
జననాథు(డు వేడినంత జాలిని(గొని నా
య్యన శాపము నీరీతిన్
దనరన్ గావ్యుండు మార్చె (దాపము( దరుగన్ 113

పుత్రు(డెవ్వండు నీలోని ముసలితనము(
బడసి తనలోని యౌవన ప్రభల నిడిన
నీ జరాక్రాంత మంతయు నృప! యడంగు
నంచు శుక్రుండు పల్కె యయాతి కపుడు. 114

అంతట పెద్ద కుమారుని
చెంతకుఁదాఁజేరి మిగుల చింతావ్రతుఁడై
సుంతైన దాఁచ నోపక
వింతగ వివరించెనిటుల వృద్ధుని వోలెన్ 115

**అంబురుహ వృత్తము :**
కావ్యుని శాపహతిన్ జరఁగాంచితిఁగాన పుత్రక! వేడ్క
భవ్యగుణంబున నాజరఁదాలిచి మారు పెట్టక నీవు నీ
నవ్య మనోహర యౌవన సంపద నా కొసంగుము నిష్టతన్
దివ్య సుఖంబుల నా పరమాత్ముఁడు తెప్పునన్ గలిగించుతన్ 116

యదు నామధేయుఁడంతట
ముదిమినిఁ గొననిచ్చలేమి భ్రూకుటి ముడుఁగన్
మదిలో యోచన సేయక
బదులాడెను దండ్రికిటుల బాపురె! యనుచున్ 117

ముదిమిన్ బొంది గాంత లెల్లరును నన్ ముట్టంగ కాంక్షింతురో
యది హేయంబని నీవెరుంగవొకొ? నాయందేది నీ ప్రేమ? నా
మది లోనన్ లలనా సుఖంబనెడు సద్భావంబు వాటిల్లదే?
పదిలంబైన వయో విధాన గరిమన్ బాపంగ నెట్లొప్పునో? 118

యదుఁడొడంబడమి యయాతి యంత సుతుని
తుర్వసుని, ద్రుహ్యు నడిగిన దుర్వికార
మంచు భావించు ముదిమిపైఁగించఁదోప
జ్యేష్ఠ సుతువోలె వారలుఁ జెప్పినంత. 119

పూరుని పిన్న కుమారుని
కారుణ్య గుణావలంబు గంజ దళాక్షున్
తోరంబైన శుభాకరు
ధీరునిఁదాఁజేరి పల్కె తిక మక పడకన్. 120

చిన్న కుమార! రార, నినుజేరితి నన్ను! దయాంతరంగ! నా
కున్న జరాభరంబుగొని యుజ్వలమౌ భవదీయ యౌవనం
బన్నల రీతి నిందుఁ బరిహాసము ఁజేయక, నాకొసంగియున్
మన్నన ఁగాంచుమన్న ననుమానము మానసమందు మానియున్ 121

అనవుడు పూరుఁడిట్లనె, యయాతినిఁగాంచి మహానుభావ! స
జ్జన సహకార! ధీవిభవ! సర్వగుణాకర! దివ్యతేజ! నీ
యనుమతిఁ దీర్చుటొక్కటియె యాశయమయ్య! మదీయ యౌవనం
బును ముదమార జేకొనుము; పొందుగ నీ జర నేను దాల్చెదన్. 122

పనిచిన పనులన్ జేయుట
జననీ జనకులకు సేవఁజరుపుట వారిన్
మనుచుట ఁగోర్కెలఁదీర్చుట
తనయుని కర్తవ్యమండ్రు ధర్మ విధిజ్ఞుల్. 123

అని పూరుఁడు తన తండ్రి జ
రనుగొని తన తరుణమెల్ల రాజిలు చుండన్
దన తండ్రి కొసఁగె ప్రియమున
ననువున జనపాలుఁడలరె యౌవన దీప్తిన్ 124

విమల వర్షాగమంబున విశ్వమెల్ల!
ప్రకృతి సంపదఁ బులకించి పరవశించె
ఆత్మ విశ్వాసము మహరాజు నలరఁజేసె
బూరు పితృ భక్తి యందు నపూర్వముగను 125

చతురాంబోధి పరీత విస్తృత మహా సామ్రాజ్య ధౌరేయుఁడై
సతతోత్సాహ వినోద భోగలహరీ సౌజన్య సన్మూర్తియై
యతులక్షాంతి గభీరుఁడై సరసుఁడై యాపన్న రక్షాత్ముఁడై
మతిమంతుండు యయాతి యేలె భువినిన్ బ్రాకాశ్యమొప్పారగన్. 126

అంతట యయాతి, సతి దేవయాని తోడ
మిక్కిలి ప్రియము మీరంగ నొక్కనాడు
పూర్వ రాజుల నెల్లను బుద్ధిఁదలఁచి
పలికె నిట్టుల మోక్షంబుఁబడయు కొఱకు 127

ఆర్యుల్ మెచ్చుగఁ బెక్కు యజ్ఞములు మోక్షాపేక్షతో సల్పివే
ధైర్యంబేర్పడ రాజులన్ఁ గెలిచి యీధాత్రీతలంబందు స
త్కార్యంబుల్ జనసమ్మతిన్ నెఱపుచున్ ధర్మంబులన్ గూర్చుచున్
స్థైర్యంపేర్పడఁ గీర్తిఁగాంచితి సతీ! సంతోష మేపారఁగన్ 128

వనితా! నీదరిఁజేరి భోగలహరీ పర్యాప్త చిత్తుండనై
తనివిన్ దీఱ సహస్రవత్సరము లత్యాసక్తితో జీవితం
బును నేఁద్రోచితి; శక్తి తగ్గినది, యీ భూభారమున్ నేనికన్
దనరన్ దాల్పగఁజాల, వృద్ధునకు సుస్థైర్యంబు నొప్పారునే 129

**మాలిని:**

కలదె పరముగాంచన్ గామలోభంబులందున్
కలదె సుఖముగాంచన్ గన్న సంతాన మందున్
కలదె మహిమ గాంచన్ కష్ట సంసార మందున్
కలదె తనివి ఁగాంచన్ క్రౌర్యమౌవృత్తులందున్ 130

అనవిని దేవయాని నృపునందలి భావనమున్ గ్రహించి నా
య్యన వచియించెనిట్లు మహితాత్మక! యంచిత రాజ్యమంతటిన్
దనయుల కీవ పంచి పిదపన్ వనభూముల ఁజేరవచ్చు; నా
మనమున నున్న కోరికను మానుగఁ జెప్పితి మాన వేశ్వరా! 131

అని దేవయాని నుడులన్
జననాధుండట్ల సేయఁజప్పున సుతులన్
దనకడకుఁజేరు కొనుమని
యనుమతిఁబంపించె, వారలందరుఁ జేరన్. 132

ంరపుర లేక భూపతి సముంచిత బుద్ధిని పూరుఁజేరి చె
చ్చెర తనకున్న యౌవనముఁజెన్నుగ నాతనికిచ్చి వృద్ధతన్
మరల వహించి పుత్రులకుఁబంచెను రాజ్యము నివ్విధంబుగన్?
బురజనులున్ సురావళులు పుణ్యచరిత్రులు మెచ్చునట్లుగన్ 133

నిశ్చల రీతి నిచ్చె యదునిన్ గని దక్షిణ భాగమంతటిన్,
బశ్చిమ భాగపాలనకు ఁబంచెను దుర్వసునామధేయునిన్,
నిశ్చయ మార్గగాముడని నిల్పెక్షితీశుగ ద్రుహ్యుబ్రాగ్దిశన్
నిశ్చిత బుద్ధి నాయనువునిన్గని యుత్తర భాగమిచ్చియున్ 134

**మాలిని:**

పరమ సుగుణ మార్గా! పండితాలోక వర్గా!
నిరత సుజన కామా! నిర్మలాకార సోమా!
సరస హృదయ శీలా! సర్వ సంగీత లోలా!
భరత జయ విహారా! భవ్యభావ ప్రచారా! 135

అనుమన్ బూరుని ఁబిల్చియు
దనరంగా మధ్య భాగ ధాత్రీతలమున్
గొనియాడుచు నతనికి నిడి
వినుమని వివరించె రాజ్య విషయమ్ము లిటుల్ 136

మతి మంతుని గుణవంతుని
ధృతధాముని నీతి పరుని దివ్య జ్ఞానో
న్నతునిన్ మంత్రిగ నీవున్
నుతిగన్ నియమింపవలె ననూనత బుద్ధిన్ 137

దక్షుల హితులన్ మిత్రుల
నక్షీణ పరాక్రమక్రమాధికులఁగడున్
దీక్షితులన్ గని సైన్యా
ధ్యక్షుల ఁజేయుటయే ప్రధానము తనయా! . 138

ధూర్తుల, పశ్యతోహరుల, దోషుల, దుష్టుల, ద్రోహచింతనా
కర్తల ,వంచనామతుల, కర్కశచిత్తుల, లోభయుక్తులన్
వర్తనలేనివారల వివాదముం దెచ్చెడి మౌఢ్య చిత్తులన్
హర్తల రాచకార్యములకై నియమించిన కీడు మూఁడెడుర్ 139

ఉర్విలోనున్న నుద్యోగులందరు
నధిక వేతనంబు నడుగఁ బోరు
ధరల నదుపులోన దప్పక మంచిన
దాన శాంతి నీకు దప్పు కొదవు 140

కులమత భేదము లెంచక
మెలకువతో మెలగవలయు మేదిని లోనన్
విలసితముగఁ బ్రజలందరు
దిలకింపఁగ నొక్కరనుచు దెలియున్ దనయా! 141

ఆరయ శిక్షాస్మృతిఁగని
నేరానికి దగిన శిక్ష నీవు నొసంగన్
ధారుణిలో శాస్త్రజ్ఞులు
దీరుగఁ గొనియాడు చంద్రు తీర్పరి వనుచున్ 142

పంగుల నంధుల దీనులఁ
గ్రుంగిన బలహీన దీర్ఘరోగుల యతులన్
జంగంబుల వృద్ధుల వికా
లాంగులఁ బోషింపఁదగు సమంచిత బుద్ధిన్ 143

కర్షక కార్మికులకు ప్రతి
వర్షము నార్థిక వనరుల వసతుల గూర్పన్
హర్షించుచు వారనయము
ఘర్షణఁగల్గించరారు, [1]గలిబిలి వడుచుర్ 144

1. గలిబిలి=సందడి, కలత

పరిపాలన విధియనఁగా
విరిపాన్పదికాదు పుత్ర! వేదన ఁజేర్పన్
బరచిన కంటక నిర్మిత
పరుపది నద్దానినెక్కిఁగి వరలుము తనయా! 145

నరపాలుండని, తాఁ సూ
కరహార్యక్ష కరిహరిణ ఖడ్గ మృగాదుల్
తిరిగెడు కాంతారముఁజె
చ్చెరఁజేరి హరి నిటుల నుతిఁజేసెను భక్తిన్ 146

**ఉత్సాహ.**

వారిజాక్ష! భవ్య చరిత! పాపనాశ! యీశ్వరా!
సారయుక్త! దేవదేవ! సౌఖ్యమొసఁగు దేవరా!
శ్రీరమేశ! శేషశాయి! సేవ్య ధామ! ధీకరా!
కోరుకొంటి నమ్మికొంటి కూర్మి మీర బ్రోవుమా! 147

**భుజంగ ప్రయాతము :**

హరీ! దోషహరీ! మురారీ ముకుందా!
హరి ద్వార వాసా! మహానంద పూర్ణా!
స్థిరౌదార్యధారా! వసిష్ఠాది వంద్యా!
వరాపేక్ష నిన్నున్ సుభగున్ భజింతున్ 148

కంజనయన! దితసుతగణ
భంజన! భృగశుక వసిష్ఠపైలాది మనో
రంజన! విలాస భావని
రంజన! దేవాద్య! బ్రోవరమ్మ రమేశా! 149

వర వైకుంఠ పురీశ్వర!
కరుణా సాగర! మహోపకార! మహేశా!
అరిషడ్వర్గ వినాశా!
అరుసంబిడ వచ్చి ప్రోవు మంబుజ నాభా! 150

నిను గొల్చిన వారికి మే
దినిలో విఘ్నంబు లెల్ల ( దీరు నటంచున్
మనమున నిన్ వేడెద నొ
య్యన దర్శన మీయ రమ్ము యరమరలేకన్ 151

జనపాలుఁ బరీక్షింప సు
జన హృదయాంతర నివాసి చక్రధరుండే
తన భక్తుఁ దలఁపుఁ దెలియఁగ
గొనగొని యేతెంచి యటకుఁ గూర్మినిటులనెన్ 152

వెఱ్ఱివాఁడవోయి! విష్ణుని వేడిన
ఫలముఁ గలుగఁ గలదె? వలదు వలదు
అంతిపురములోనఁ గాంతల కౌగిళ్ల
హాయిఁబొందుమయ్య! యడవి విడచి 153

అనవిని యయాతి విభుఁడున్
మనమందున మార్పుఁగొనక మానుగ (దపమున్
గొన సాగించిన హరి నొ
య్యన నతని కభీష్టవరము లమరఁగ నొసఁగెన్ 154

శ్రీ యయాతి చరితఁజెప్పి శుకమహర్షి
చిత్తమందు (దనివిఁజెంది మిగుల,
నంత మౌని యిట్టు లంబికాధవుఁగూర్చి
ప్రార్థనమ్ము (జేసెఁబరము నెంచి 155

**కవికంఠ భూషణము :**

కరుణాలవాల! జయకాంక్షిత భక్త వినోద మానసా!
దురితాపహార! బహు దుర్జన నాశనకార! శంకరా!
పరమాత్మ! యాయత శుభంకర! దైత్య నికృంతన క్రియా
కర! పార్వతీ రమణ! కష్ట నివారణ! యాశ్వరా! నమో. 156

పంచ చామరము :
పరోపకార! వీరధీర! భావిఁదెల్పు మో హరా!
పరా! మహేశ! దేవదేవ! ఫాలనేత్ర! శంకరా!
గిరీశ! యీశ! విశ్వనాథ! గీష్పతీ ప్రశంసితా!
విరించి వంద్య! వేద వేద్య! వృద్ధిఁగూర్చు మో శివా. 157

**మాలిని :**
సకల స్వజన పోషా! చారు సంతోష భాషా!
సుకృత హృదయ ధారా! సోత్ర పారాధి వాసా!
ప్రకృతి సుషుమ సూత్రా! భవ్య సౌందర్య గాత్రా!
ప్రకటిత గుణధామా! పార్వతీనాథ! భీమా! 158

**సింహరేఖ :**
వారణాసి విశ్వనాథా!
నీరజాక్ష నీలకంఠా!
నారదాది మౌని వంద్యా!
కోరు కొంటి ఁబ్రోవు మీశ! 159

హరహర! మారమార! సుగుణాకర! ధీకర! నీలకంధరా!
పురహర! నిర్వికార! ముని ముఖ్యదయాకర! శైల మందిరా!
మురహర! దోషదూర! వరపుణ్యవిశారద! పార్వతీశ్వరా!
అరమరలేక కొల్చెద నిరంతర మాత్మను బ్రోవు మీశ్వరా. 160

**చంద్ర వర్త్మ :**
భూతి భూషిత! ప్రపోషిత! వినుతా!
ఖ్యాతి దాయక! దయాంచిత! సుగుణా
భూత నాయక! ప్రమోద! జయకరా!
దాత నీవని సతంబుఁగొలిచెదన్. 161

**సింహరేఖ :**

ఫాలనేత్ర! వేద వంద్యా!
కాలకాల! లోకపాలా
శూలపాణి! నిన్ను గొల్తున్
శైలజేశ! బ్రోవు మీశా! 162

**సమాని :**

ఘోర విఘ్న నాశ! హరా!
తోరమైన త్యాగివనీ
చేరి నిన్ను వేడితినీ
చేర దీసి కావుమికన్ 163

**సుగంధి వృత్తము :**

శూలపాణి! నాగహార! సూర్యచంద్రవీక్షణా!
కాలకాల! నీలకంఠ! కామితార్థ దాయకా!
ఫాలనేత్ర! జ్ఞాన సూత్ర! పార్వతీ మనోహరా
జాలమేల బ్రోవు మయ్య! సర్వవంద్య! శంకరా! 164

గద్యము

**శ్రీ కొమర్లగోత్ర పవిత్ర**

**నాగయ పౌత్ర గోపాలయ ప్రథమపుత్ర**

శ్రీగుండాల కోనేశ్వర కరుణాకటాక్ష లబ్ధకవితా విస్ఫురణ
బొడ్డుబోయిన వేంకటనారాయణ ప్రణీతంబైన
గోకులాభ్యుదయంబను ప్రబంధంబున
ప్రథమాశ్వాసము.

# గోకులాభ్యుదయము

## ద్వితీయా శ్వాసము

శ్రీ కైలాస నివాస! య
నేక ఫణీ మణి వికాస! ఈశ! మహేశా!
యాకాశ కేశ! గిరి శా!
శ్రీ కావ్య గుణప్రశంస! త్రిపుర వినాశా! 1

అనఘాత్మ! యయాతి ప్రభు
ఘన చరితన్ నేను వింటి,ఁగంటిని ముదమున్
దనిసితి; ఁద దనంతర కథ
వినిపింపవె నాకుఁదెలియ వేడ్కఁ దలిర్పన్ 2

వినుమని సంతోషము నె
మ్మనమున ఁదొందరింపఁబంచాస్యువలెన్
దనరన్ బలికెను జరితముఁ
దన మది శుకమౌని తలఁచి ధాత్రీశునకున్ 3

అలరఁగ నా యయాతి సుతుఁడైన యదుక్షితిపాలు వంశమం
దెలమి గలట్టి పుణ్య కథ లిమ్మహి, భక్తిఁదలంపఁగావలెౕ,
విలసిత రూపధారియయి విష్ణుఁడలచిత్కళ లెల్లఁజూపఁజి
ద్వెలుఁగులఁ బుట్టి కృష్ణుఁడన విశ్వగురుండయి కీర్తి నొందుటౕ. 4

సరస వచోవిలాసమున, సత్పథమందున, శౌర్యసంపదన్,
సరిపడు దానమందున, ప్రశస్త జయంబున, ధీబలంబునన్,
పురికొను కీర్తియందున, నపూర్వ పురోగమనంబునందునన్
వరదుఁడుగా ఁబ్రసిద్ధిఁగొనె పాలనలోన యదుండు దక్షుఁడై. 5

**సుగంధి.**
వందలాది రాజులెల్ల భక్తిఁగాన్కఁ లీయఁగన్
విందుగా గ్రహించి తాను విస్తృతాధికారియై,
పొందుగన్ ''సహస్రజిత్తు''ఁబోల్చు క్రోష్టువున్ ''నలున్''
యందమౌ రిపుండనన్ సునందనుల్ జనింపఁగన్. 6

**సుందరము :**
మోదముఁబొందినరాజు భూరి విరాళముల్
సాదర బుద్ధి నొసంగి సర్వుల కావలన్
వేద వినోదుని విశ్వవృత్తుని వంద్యునిన్
★సేదఁదలంచక పూజఁజేసెను నిష్ఠమై. 7

క్షాత్రమె రాజ చంద్రునకు శాశ్వత సన్నుతి నిచ్చు నంచు వే
శాత్రవ జైత్ర యాత్రల నృశంస నృపాలుర నోడఁజేసి, యే
మాత్రము దండనీతి విధి మార్గము వీడక ధైర్య ధుర్యుఁడై
★సత్రి 'సహస్రజిత్తు' పటు శౌర్యముఁ జాటుచు కీర్తిమంతుఁడై. 8

**పంచచామరము :**
సహస్ర యజ్ఞముల్ కడున్ బ్రశస్త రీతిఁ జేయుచున్
విహాయితమ్మునన్ బ్రతిష్ఠఁబెంచి వేద మాతయే
సహాయ మిచ్చు నంచునెంచి సర్వవేళలందునన్
సహర్ష మొప్ప వేడుచున్ బ్రసాదమొప్పఁ గల్గినన్. 9

మును జేసిన నోమన
జన పాలునకు ''శతజిత్తు'' జన్మించె, నతం
డనుపమ వీరుండగునని
మునులున్ దీవింపఁ బ్రభుని మోదము మీరెన్. 10

**మంజు భాషిణి :**
పరరాజ్య సంగ్రహణ భాగధేయుఁడై
పరమార్థ జీవిత శుభ ప్రధానుఁడై
నిరతోపకారగుణ నిర్మలాత్ముఁడై
స్థిరధైర్యమూని శతజిత్తు భాసిలెన్. 11

రాణ వహించి, ''మహాహయ''
'వేణుహయ' హైహయులను విఖ్యాత జగ
త్రాణుల శతజిత్తు వడసె
స్థాణుని వరపూజ వలన జనులిలఁబొగడన్. 12

---

★ సేద : బడలిక, శ్రమ
★ సత్రి : ఎడతెగక దానము చేయువాఁడు

పృథ్వి:
అశేషభుజశక్తితో రిపు గజాస్య బృందంబులన్
ప్రశస్త మణి భూషణంబులు సువాసన ద్రవ్యముల్
దిశల్ గెలిచి తెచ్చి హేహయుఁడు ధీరుఁడౌ ''ధర్మునిన్''
బ్రశంసఁగని భూతలంబున విరాజిలెన్ మాన్యుఁడై 13

ధరణి పాలుండు ధర్ముండు ధనువుఁదాల్చి
శాత్రవానీక మంతటిన్ సమర మందుఁ
బాఱఁ జూఱంగ వారలు ఁబారి పోవ
నుతి వహించి ''నేత్రుండ'' ను సుతుని వడసె 14

**స్వాగతము :**
నేత్రుఁడు న్ ఘన మనీషుఁడు కాగన్,
శాత్రవుల్ మిగుల సన్నుతు లివ్వన్,
మిత్రుఁడై పరగి మేలుగఁ 'గుంతిన్'
ధాత్రిలోఁబడసి ధన్యతఁ గాంచెన్. 15

కుంతికి ధరఁగలిగె 'మహి
ష్మంతుండను సుతుఁడొకండు సాహస్రశ్రీ*
మంతుఁడునై రాజ్యమ్మును
సంతసమున నేలె ఁబ్రజలు సన్నుతిఁ జేయన్ 16

భవ్యుఁడౌ మహిష్మంతునకు భద్రమూర్తి
'భద్రసేనుఁడు' నతఁడును బడసె నొకని
'దుర్మదుం'డను బుత్రుని ధర్మపరుని
నతఁడు ధృతిఁదాల్చి ప్రభువుగా నుతిగడించి. 17

ధర్మ చింతనంబు దాక్షిణ్యమును దాల్చి
మర్మమెల్ల నెఱిగి మంచి నెంచి
నీతి వర్తనమున నిరతినిఁ జూపించి
'ధనికు'ఁడనెడు సుతునిఁదానుబడసె. 18

*సాహస్రుడు = వేయి బలములకు అధిపతి

చతురంగ బలములఁ జాతుర్యముననెంచి
అరివర్గమంతటి నాజిగెల్చి
దుష్ట శిక్షణఁ జేసి శిష్ట రక్షణ నిల్పి
న్యాయనిర్ణేతయై నవకమంది
యాశ్రితావళిఁగాచి యనురాగ హృదయుఁడై
పరమార్థము నెఱిఁగి పరువుఁ బడసి
''కృత వీర్యుడు'' 'కృతాగ్ని' 'కృతవర్మ'ను 'కృతౌజు'
లనఁబడు తనయులఁ దాను బడసి
నిత్య సత్య వచన నియతిఁ బాటించుచున్
సాహితీ సభలఁబ్రశంసఁగాంచి
యశము నందుఁదానె యాధిక్యుఁడనఁజాటి
'ధనికు'ఁడాక్షితిపతి ధరణిఁ దనరె. 19

పద్మకము:
విరివి కీరితిని నా కృతవీర్యుఁడు వెల్గుచున్,
నరుల వలగొను సుంకమునన్ గడు మించుచున్,
ధరణిఁబాలన, నుదారతఁదానొనరించుచున్
హరికళన్ గనియె 'నర్జు' సమాహ్వాయు నొక్కనిన్ 20

దత్తాత్రేయుని మహిమన్
జిత్తంబున నెలమి (దాల్చి సేవలు చేయన్
సత్తముఁడై యోగ స్థితి
నత్తఱి నర్జుండు వడసి నంతట నతఁడున్ 21

శ్రీరాజిల్లు విశిష్ట రాజ్య పదవీ సింహాసనాసీనుఁడై,
సారాచార వివేక వర్తనుఁడునై సద్భక్తి యేపార కై
వారమ్ముల్ వడి వైరి వర్గములిడన్ వర్ధిష్ణుఁడై నిత్యమున్
బారావార గభీరుఁడైపరగె సౌభాగ్యంబు శోభిల్లఁగన్ 22

ముదిమిని పడయక తరుణముఁ
బదిలంబుగఁ బడసి రేడు ప్రావీణ్యుండై
పదివేలేండ్లు భువిఁ గో
విదులుఁ బొగడ రాజ్యము నభివృద్ధిఁగొరెఁ 23

అమరన్ విభుఁడు సుత సహ
స్రమునున్ గాంచంగఁ బరశు రాముండలుకన్
సమరంబున దునుమాడెను
గ్రమమునఁ బెక్కుర నొకింత ఁగరుణయు లేకన్ 24

పరశురాముని బారిలో బడక నెటులొ
క్షితి 'జయధ్వజుండు' ను 'శూరసేనుఁడు' నల
'వృషణుఁడు' మధువు' నాఁబడు వీరవరులు
అర్జు సుతులందు బ్రతికిరి యర్హులనఁగ. 25

ఆ జయధ్వజుండు నవ్వార లందునఁ
గీర్తి సాంద్రుఁడగుచు స్ఫూర్తి మీర
రాజ్య తంత్రమెఱిఁగి రాజ్యంబు నేలుచు
వెలసి పరువు ఁగొనెడు వేళ యందు. 26

దురమున్ జేరి పరాక్రమక్రమ కళాధుర్యుండునై మాన్యుఁడై
పరువొందన్ మదినెంచి శత్రుతతిపై బాణాగ్ని వర్షంబులన్
గురిపింపన్ క్షత గాత్రులై భయమునన్ గోరాడుచున్ బాఱినన్
జెరలన్ ద్రోయుచు మేటి రాజ్యమునఁజేర్చెన్ వారి రాజ్యంబులన్. 27

అంత విభుఁడు నౌర్యముని తేజంబు వలన
సుత శతంబును బడసెను శుభము వెలయ
వారిలో 'వీతిహోత్రుండు' ప్రథముఁడగుచు
బహుళ విఖ్యాతి నార్జించె వంశమందు. 28

మధుర వచశ్శ్రీ వెలయఁగ
బుధనుతుఁడయి దోర్బలంబు ఁబొందియు ధరణిన్
మధువు రిపుగణములఁగెల్చి
నిధులను గొనితెచ్చి 'వృష్ణనిన్' దాఁబడసెన్. 29

**పంచపాది :**

వృష్ణునకుఁబుత్ర శతమొప్పెఁబ్రీతి మీర,
నందు 'వృష్ణి' ప్రథముఁడయి ఖ్యాతిఁగాంచె
వరలు మధువృష్ణి యదువుల వంశజులిల
మాధవులు వృష్ణువులు కడు మహిమ వెలయు
యాదవులనన్ బరగిరి యవనిలోన. 30

యదుపుత్రుండగు క్రోష్ణువుండిల భద్రాయత్త చిత్తుండునై
సుదతీలోక సుమా స్త్రుఁడై విజయుఁడై సూర్యప్రభాధుర్యుఁడై
కదనంబందున భీకరాకృతుఁడునై కంజాత పత్రాక్షుఁడై
తుదిఁదా జీవితమందునన్ 'వృజినవంతు'న్ గాంచె సంతుష్టుఁడై. 31

వృజిన వంతుఁడై 'స్వాహితు' ఁబ్రీతి ఁగాంచె
నతఁడు 'భేరి శేఖుండను' సుతునిఁ బడసె
నతఁడు 'చిత్రరథుండ'ను సుతునిఁబొందె
నతఁడు 'శశిబింద' నన్ బుత్రు నందె నెలమి. 32

పదివేల యింతులొదవన్
ముదితాత్ముఁడయి శశిబిందు భూమీశ్వరుఁడున్
బదివేల లక్షల సుతులఁ
బదిలంబుగ ఁబడసి తనరె వైభవ లీలన్. 33
అతని సుతుల మొత్త మందు ముఖురులైన
ఆర్వురందుఁదనరె నవనిలో బృ
థుశ్ర వుండు నతఁడు దోస్సారమున 'ధర్మ'ఁ
డనెడు సుతుని ఁబడసి తనివి నొందె. 34

మించిన పౌరుషమ్ము కడిమిన్ గడి దేరిన ధర్ముఁడంత నా
అంచుల కైదువున్ గొని బరాబరివైరుల మస్తకంబులన్
ద్రుంచుచు ఁగానుకల్ కొనుచుఁదోడెము కష్టము భూ ప్రజాళికిన్
బంచక ఁబాలనమ్మున శుభంబొదవంగ దిగంత తేజుఁడై 35

ఉత్సాహ:
సంతులేని కొఱఁతఁదీఱ సహన మహిమఁజేర,గా
నంతరాత్మ మురియ 'నుశను' ఁడనెడు సూనునొక్కనిన్
సంతసమునఁ బొంది యంత సర్వ యాచకాళికిన్
స్వంత కలిమి నెలమిఁ బంచె వంశవృద్ధి యేర్పడన్ 36

నూరశ్వ మేధములనే
పారగఁజేసి 'యుశనుండు' నవనీ స్థలిలో
మీరిన యశమున భాసిలి
కోరికతో 'రుచికుఁడ'ను కొమరున్ గాంచెన్ 37

'పురజిత్తు'న్ 'రుక్మండు'న్
ధర 'రుక్మేషువు' 'పృథువ'ను దనయులఁ దా
బరగన్ 'జ్యాముఖుఁడ' న నే
వుర నా రుచికుండు వడసి ఁబుణ్యాత్ముఁడనన్ 38

అలరు వారిలోన జ్యాముఖుండధికుఁడై
రాజ్య భారమూని రాణకెక్కి
'శైబ్య' యనెడులలన సంతోష మొప్పంగఁ
బెండ్లి యాడి తాను వేడ్కనున్న 39

ఎంతో రాజ్యము విస్తరించినను ధాత్రీశుల్ మహాభక్తితో
వింతన్ గాంచన రత్నభూషణ తతిన్ వేమాఱులర్పించినన్
జెంతన్ గాయక గాయనీమణులు రంజిల్లంగఁజేకూరినన్
సంతానోన్నతి లేక 'జ్యాముఖుఁడు' సంతాపంబుతో నంతటన్ 40

పెరవారి గేహ మందున
నరిదిన్ విహరించు సుదతి నధిపుఁడు గని సం
బరమునఁగొని తెచ్చిన నృపుఁ
బరువున్ దెలియక శైబ్య ప్రశ్నించె నిటుల్. 41

జననాథా! యిదియేమి యబ్బురము? నా సౌందర్యమున్ నచ్చవో?
నను బొందన్ సుఖలీలఁగాంచవొకొ? నీ న్యాయంబదే మానాకో
ఘనమౌగేహములోన భార్య తుదకున్ గన్పించెనా భూతమై
కనవో నీతిని? నిన్నుఁగాంచిన జనుల్ గర్హింపరే నిత్యమున్! 42

అనవిని భూతల నాథుఁడు
తన రాజ్ఞికి నిట్టులనియె "తామసమేలా?
కొని తెచ్చిన యీ కన్యక
మనకున్ గోడలగు నిజము మానిత సుగుణా! 43

అని జననాథుండన
మనమున సంతోషమంది మర్యాద మెయిన్
గొనితెచ్చిన పూబోణిన్
తన కోడలు వోలె రాణి తనివిన్ జూచెన్ 44

అంతట రాజ్ఞి గర్భము సమంచిత రీతి ధరించి నందునున్
సంతసమేర్పడన్ గనియె, సాహస ధుర్యుని, లోకమాన్యు, న
శ్రాంత మనోజ్ఞ మానుసుని, రాజిలు రాజ్య కళాకలాపునిన్,
గంతు సమాను, లోకహితుఁ గల్మషదూరు, 'విదర్భ' నాథ్యునిన్! 45

యాద వేంద్రుఁడంత నానంద మందుచు
దాన మిచ్చి మిగులఁదనివి నొంది
పెంచి పెద్దఁజేసి ప్రియమారఁదెచ్చిన
వేడ్కఁ గన్య నిచ్చి పెండ్లిఁజేసె 46

అతుల గుణోజ్వలుఁడయి, యా
శ్రిత మందారుఁడయి, శేముషీన్నుతుఁడై యూ
ర్జిత బాహు పరాక్రమ సం
యుతుఁడై రాకొమరుఁడంత నుర్వీశ్వరుఁడై. 47

**కవిరాజ విరాజితము :**

అరిది బలంబున నాలను బెబ్బులి యారడిఁ బెట్టెడునట్టుల సం
గరమున భూపతి కర్కశ బాణయుగంబుల వైరులుగాసిలగన్
బిరబిర వేసిన భీతిని వారలు విహ్వలులైయట వెండి చనన్
బరువము మీఱఁగ వారల యాస్తుల వాసిగ లో, గొనెభవ్యమతిన్. 48

క్రోష్ఠు ('గుశుఁడు' 'గ్రుథుడు' 'రోమపాదుఁడ'నెడు
తనయులు గలిగిరి విదర్భ విభుని
కెలమి, వారిలోన నిల రోమ పాదుండు
రాజ్య భారమూనెఁ బ్రజలు వొగడ. 49

**మత్తకోకిల:**

రోమపాదుఁడు శౌర్యమూని విరోధివర్గము నాజిలో
దామడించిన లొంగివారలు దాపుఁజేరిన వారలై
సామజంబులగో, గణంబుల సన్నుతించుచు నీయగన్
భూమి నేలుచు 'బ్రభ్రువు'న్ గనె భూసురావళి దీవనన్ 50

**తోవకము:**

ధీర గుణాకర తేజము మీరన్
వైరుల గెల్చిన బ్రభ్రువు ధాత్రిన్
శారద సేవల సంపద చేతన్
భూరి యశంబును బొంది చెలంగెన్. 51

ప్రభువగు 'బభ్రువు' 'విభునిన్'
విభవంబున ఁబడసి, విభుఁడంతన్ దా
'నభయు'ని 'కృతి' యను బుత్రున్
శుభ మొప్పగఁగాంచి తనరి శోభన్ మీరెఁ 52

'కృతికి' 'నుశికుండు' జనియించెఁ గృత్యవలన
ఉశికునకుఁ 'జేది' చేదికి నుర్విలోనఁ
జెలఁగు చైద్యాదు లొదవిరి క్షేమమలరఁ
'గ్రుథున' కుదయించెఁ 'గుంతి' యేకొరత లేక. 53

'ధృష్టికి' 'నిర్వృతి' నిర్వృతి
క్షిష్టతఁగల్గెను 'దశార్హుఁ'డిలను, దశార్హుం
డ్దష్ట దిగాంచల రాజ్యము
శ్లిష్ట జనులు వొగడ నేలె, శ్రీకర మొప్పన్. 54

ష్ప్యేమున కుదయించెను ధర
'జీమూతుండ' ను సుతుండు, జీమూతునకున్
బ్రేమన్ 'వికృతి' జనించెను
భూమీశులు వొగడునటుల భూమిన్ వెలసెన్ 55

వికృతికిన్ జనించెను ఘన 'భీమరథుఁడు'
భీమరథునకు ఁగల్గె సంప్రీతి మీఱ
'నవరథుండను' బుత్రుండు; నవరథునకు
'దశరథుండను' దనయుండు తనరఁగల్గె 56

అవనీ భారము మోయు దిగ్గజములశ్రాంతం బవిశ్రాంతులై
నివసింపన్ గృశియించిపోయినవి, యానిందన్ వడిన్ బాపఁగా
నవలీలన్ విభుఁడాభరంబు వలకేలన్ దాల్చి పెంపొందఁగన్
ధ్రువ విశ్రాంతి దిగేభముల్ బడసె, సంతోషంబు సంధిల్ల' గన్ 57

శ్రీరహిఁగూర్చు రూపు, పటు సేవ్య గుణావళి కెల్లఁబ్రాప హం
కారములేని యేపు, పరకాంతలు నిచ్చలుఁగోరు చూపు, సత్
గౌరవమిచ్చు నింపు, సహకారముఁగూర్చెడు పెంపు, దుష్టులన్
దూరము జేయు తెంపు, భవదోషము దింపు, ప్రభావమేర్పడన్ 58

అలరన్ బాండిత్య ధురీ
ణులు సన్నుతిఁజేయ, ఆేడు నొడికారమునన్
బలు పద్యంబులఁజెప్పుచు
నలరించెన్ బ్రజలనెల్ల నాహ్లాదమునన్. 59

దశరథునకు జనియించెను
కుశలంబుగ 'శకుని' నతఁడు 'కుంతిని' గాంచెన్
దశగా నా కుంతికి స
ద్యశ మొప్పన్ 'దేవరాతుఁడ'ను సుతుఁడొదవెన్. 60

సకలోర్వీతల నాథుఁడై యతఁడు దోస్సార ప్రభన్ భానుఁడై
టకటొంకుల్ గలిగించు శత్రువితతిన్ టాటోటు లేకుండ వా
లిక బాణావళిఁబూని, వారిపయి గీలించంగ వారల్ కకా
వికలై కాళ్లకు బుద్ధిఁజెప్పఁబ్రభువున్ వృద్ధిన్ వడిన్ బొందుచున్. 61

సామంతులు కప్పంబులు
నేమంబుగ నిచ్చు చుండ నిర్మల మతితో
క్షేమా పేక్షన్ జనులకు
భూమీశుండేలు చుండెఁ బొంపిరి వోవన్. 62

దేవరాతుఁడంత 'దేవక్షత్రు'డనెడు
సుతునిఁగాంచె; నతఁడు నుతినిఁ బడసి
'మధువు'ఁ గాంచె; నతఁడు మహిని 'మహివశుం'డ
నదగు పుత్రుఁబడసె ననువు మీఱ! 63

భాషా షోషకుఁడయి ని
ర్దోషమ్మునఁదాఁజరించి రోకున 'ననువున్'
భూషింపన్ బడసె నతఁడుఁ
బోషితుఁ ''బురుహోత్రుఁడ'' నెడు పుత్రుని ఁబడసెన్ 64

పురుహోత్రుని పాలనమునఁ
గఱవే కనరాకపోయె; గావున ప్రజలున్
బరమానందము గొననిల
వరలెన్ హరు దేవళాలు వైభవలీలన్. 65

అతనికిఁబుట్టె 'నంశువ'ను హర్ష వినోదముఁగూర్చువాడు, స
న్మతి యుతుఁడైన 'సాత్వతుని' మానుగనాతఁడు ఁబొందె, సాత్వతుం
డతుల పరాక్రమంబున దిశావృత రాజుల, గెల్చి నిత్యమున్
నుతిఁగొన రాజ్యమేలెను, వినూతన శాసనముల్లొ నర్చుచున్ 66

అతఁడును గాంచెను, సుతులా
ధృతి 'భజమాను'ని 'భజియివు' 'దివ్యున్' 'దృష్టిన్'
ధృతుఁడగు దేవా పృథునిన్
నుతుని 'మహాభోజు' 'నందనుంథిడను' వారిన్ 67

పరగు భజమానుని ప్రథమ భార్య యందు
వెలయు 'నిమ్రోచి' 'కంకణ' 'వృష్ణి' లనెడు
ముగురు పుత్రులు బుట్టిరి మోదమలర,
వారు దోస్సార పటిమచే వాసిఁగనిరి! 68

ప్రతిభఁగాంచిన రెండవ భార్య వలన
నలరు 'శతజిత్తు' ఘనుఁడు సహస్రజిత్తు
'నయతజిత్త'ను పుత్రులు న్యాయ ధనులు
జనన మందిరి, జననాథు స్వాంతమలర! 69

**ఉత్సాహ :**

ఏపు మీఱ నవనిలోన నేచు వట్టి వైరులన్
రూపు మాపెఁదాను మిగుల రోష భీషణాకృతిన్
ప్రాపులేని వారి నెల్ల ఁబ్రాజ్ఞుఁడగుచుఁ గాచిదే
వాపృథుం'డల నుతి వడసి పాలనాభిరాముఁడై 70

**పృథ్వి :**

అమేయ ధిషణా ధురంధరుఁడునై బుధారాధ్యుఁడై
ప్రమోదకర యోగ విద్యల ఁబరాబరిన్ జెప్పఁగన్
క్రమానుగతి విన్నవారికి నఖండము క్తేర్పడన్
విమర్శనమునన్ ఘనుండన ఁబవిత్ర చారిత్రుఁడై 71

నెలలోన వానలు నియమొప్ప వర్షించె,
పుడమి కడున్ సస్యపూర్ణమయ్యె,
కుంభ ప్లుతంబుగ గోవులు పాలిచ్చెఁ,
జతురంగ బలములుఁజాలవెలసె,
వైరి రాజులలోన భయమెల్లఁజెలరేగె,
దుర్మార్గ గాములు దూరమైరి,
స్వార్థ చింతన లెల్ల బహుదూరమైపోయె,
జారచోరుల బాధసమసిపోయె
కఱవు కనరాక పోయెను, కలిమి చెలఁగె,
మేలి బ్రతుకులు ప్రజలందు మేళవించె,
రాజ రాజను బిరుదాన రమణుఁడగుచు,
వరలె, దేవాపృథుండుఁ నీ వసుధ లోన. 72

దేవా ప్రథునకు బభ్రువు
లీవిన్ జనియించెఁబ్రజలు లేవ చెలంగన్
*మేవడి నిట్లాడిరి స
ద్భావము హృదయంబులందు పరగెడు కతనన్ 73

మరునిఁ బోలు వాఁడు మహనీయధుర్యుండు
దాన గుణములోన దనరు వాఁడు
పేద లనిన మిగులఁబ్రీతి ఁజూపెడి వాఁడు
కలియుగాన నెపుడుఁగానఁబడునె? 74

ఆ మహాభోజుని వంశజు లవనిలోన
భోజు లనఁబడి కీర్తులఁ బొంది రెలమి
'వృష్ణి' కొదవె సుమిత్రుఁడు వీర వరుఁడు
అతని కుదయించె 'ననమిత్రు' ఁడనెడు సుతుఁడు 75

అనమిత్రున కుదయించెను
అనువుగ 'నిమ్నుఁడ'ను సుతుఁడు నభివం
దనముల్ గొని, ధాత్రిని బా
లనమున్ గావించి మించె లాలస బుద్ధిన్ 76

కనులెఱ్ఱన్ బడఁదీవ్ర కోపమెసఁగన్ గయ్యంబునన్ దూరిఁతే
రున నశ్వంబుల నీరదభ్రమల నేర్పున్ మీఱ దూకించి చ
య్యన నా వైరి మదేభ యూధములపై నారాచ వర్షంబులన్
మునుగన్ జేయఁగ వారు లొంగి చనరే, బోరామి నర్థించుచున్ 77

ప్రభువు లందుఁదాను ప్రథముఁడై విలసిల్లి
శాంతి దాంతు లెల్ల ఁజాల నెఱపి
యోగ విద్య లందు నుజ్వలుఁడైమించి
'నిమ్న' ఁడు తన తండ్రి యశము నించి మెఱసె. 78

---

* మేవడి = ఉచితము, ఉత్సాహము

నిమ్నుఁడు గాంచెను నిలిజ్జుఁడై క్రాలు
'సత్రజిత్తు'ను వాని స్థైర్య ధరుని
మఱియు 'ప్రసేను'ని మాన్యుని ఁగాంచెను
నోములు నోచిన సోమమనఁగ
ననమిత్రునకుఁగల్గె శినియను వేరొక
సుతుఁడాహవస్థలీ శూరుఁడనఁగ
అతనికిఁగల్గె 'సత్యకు'ఁడనఁబడువాఁడు
నతనికి నయిుధాయుఁడనఁబరగిన
'సాత్యకి' జననమందెను, శక్తి మీఱ
నతఁడు వైరి మదేభసింహమను యశముఁ
గాంచి, ధరణి 'జయు'ఁడనెడు ఘనునిఁబొందె
నతఁడు 'కుణి' యను సూనుని నమరఁబడసె 79

కుండము వోలెఁగన్నులఁ బ్రకోపము కన్పడఁగేతువోయనన్
జండిత ధారఁగల్గు నిజ చాప విముక్త శిలీముఖమ్ములన్
భండన మందు శాత్రవుల బ్రమందగఁజేసిన 'యాశ్వఫల్క్యుడున్
గండర గండడోయనఁగ ఖ్యాతినిఁగాంచెను ధారుణీ స్థలిన్ 80

**మంజరీద్విపద :**

అమలు ఁ'డక్రూరుం' 'డనంగుఁడు' 'సార
మేయుఁడు' 'మృదకుండు' 'మృదు పచ్చికుండు'
కొమరుగా 'వర్మదిక్కుఁన్' 'ధృష్ట వర్మ'ఁ
డలరు 'క్షత్రోపేక్షు' ఁడరిమర్ద నుండు 81

స్థిరుని 'శత్రుఘ్నుని' జెలువొప్ప 'గంధ
మాదను నతిబలు "ప్రతిబాహు" నెలమిఁ
బన్నిద్దర సుతుల వర 'సుచారు'వను
కొమరిత ధరణినే కొరత లేకుండ
'నాశ్వఫల్క్యుఁడు' గాంచె నానంద మొప్ప. 81

ప్రాకారాళి గదా ప్రహారముల నుత్పాటించి శత్రౌఘముల్
లోకుల్మెచ్చ శిలీ విఘాత వితతిన్ లొంగన్ వడిన్ జేసి యొ
క్కూ(కన్వచ్చిన సైన్యమున్ నరికి యశ్రాంతమ్ము రాజ్యమ్ము న
స్తోక ప్రాభవలీల నేలె విబుధుల్ స్తోత్రాల జేకొట్టఁగన్ 82

అక్రూర విభునకు ననువొప్ప 'దేవుండు'
'అనుపదేవుండను' తనయు లుదయ
మందిరి; వారలు మహిమతో విలసిల్లి
చిరకీర్తి యుక్తులై పరువు (గొనిరి
చిత్రున కొదవిరి శ్రేష్ఠుఁడు 'పృథుఁడు' వి
దూరథుం'డన (బడు వీర వరుఁడు
వారిరువురెకాక బహు పుత్రులుదయించి
వృష్టి వంశజులన (బేరు(గొనిరి
అంధకునకు జన్మించిరి యాశ దీర
నలరు 'భజమానుఁడు' 'కుకురు'ఁడనెడు వీర
ధనుఁడు, మఱియు 'శుచీ' యను దానగుణుఁడు
నమర' (కంబళ'-'బర్హిష(" డనెడు ఘనుల 83

కుకురుఁడు 'వృష్టిన్' గనె, (బా
యక వృష్టి మహిమవలన నవనీ స్థలిలో
నొక సుతుని 'విలోమతనయు'(
బ్రకటిత గుణధాము(గాంచె (బ్రజలున్ వొగడన్ 84

అతఁడురు కీర్తి ధాముఁడయి యంచిత శౌర్యు(గపోతరాముని
ప్రతిహత వీరునిన్ బడసె వైభవ కీర్తి వహించి, తానిలన్
మతు ననువున్ ఘనున్ గనె మనోజ్ఞ మెలర్పనతండు పేర్మితో
మతియుతుఁడైన 'దుందుభి'ని మానుగ(గాంచె జగద్ధితంబుగన్ 85

దుందుభీ విభునకు 'దవిద్యోతు'ఁడొదవె
నతఁడు గాంచె ('బునర్వసు'ఁడనెడు సుతుని,
నతఁడు 'నాహుకు' (డన(బడు సుతుని మఱియు
'నాహుకి' యను పుత్రికను గనంగ నంత 86

'దేవకుం' 'డు(గసేనుండు' నా వెలసెడి
వారుదయమైరి, 'నాహుకు' వలన మిగుల
పూర్వ రాజుల మార్గంబు (జూసి వారు
వసుధ (బాలన (గావించి వాసిఁ గనిరి 87

**మంజరీ ద్విపద :**

'దేవలుండు' 'నసుపదేవుండు' దగ 'సు
దేవుండు' శూరుఁడౌ 'దేవవర్ధనుండు'
నా విలసిల్లెడు నలువురి సుతుల
'ధృత దేవ'యును 'శాంతిదేవ' యు నెసఁగు
'శ్రీవృత' 'నుపదేవ' 'దేవకి' నెలమి
'దేవ రక్షిత' 'సహదేవ' 'దేవకి' శు
భావహ పుత్రికలమర నేర్వురను
'దేవకుండు' గని సంతృప్తిన్ జెలంగె 88

దేవకుని కూతులందరు
భూవలయంబందు సొంపు (బొందిన కతనన్
(బావీణ్యుండనఘుఁడు వసు
దేవుని (బెండ్లాడిరంత దివ్యులుఁ బొగడన్ 89

ఘనుఁడైన 'కంసుండు' దనర 'న్య(గోధుండు'
క్షేమంకరుఁడు 'సునామకుండు'
'గహ్యుండు' 'శంకుండు' కమనీయ 'శంభువు'
'రాష్ట్రపాలుండు'ను రమ్య గుణుఁడు
నౌ 'విసృష్టుండు' మహాధికుండనియెడు
'దుష్టిమంతు'డను సుతులను మఱియు
మహనీయ రూపులు మానితలై యొప్పు
'కంస'యు రమణీయ 'కంసవతియు'
నల 'సురాభువు' ఘననీతులైన యట్టి
'రాష్ట్రపాలిక' నాబడు రమ్యమైన
కూతులను గాంచె భువిలోన (గూర్మి మీఱ
'ను(గసేనుండు' జనులెల్ల నుత్సహింప! 90

అందము (జిందెడు యంగన
లందఱు వసుదేవు ననుజు(డరసి తనిసి యా
నందము మీఱ(గ వారల
బొందుగ(బెండ్లాడి మించె భూపతులలరన్ 91

అల 'విదూరథు'(డను వెలసెడు పుత్రుండు
'భజమాను'నకు( బుట్టె వసుధ లోన,
ఆ విదూరథునకు ననురాగ మొప్పార
'శిని' యను బుత్రుండు జనన మందె,
నతనికి 'భోజుండు' నుతి(గాంచ నుదయించె,
భోజుండు 'హృదికుని'( బొంది చెల(గె
హృదికుండు మహనీయ హృదయుండుగానుండి
దివ్య తేజంబున(దీప్తి నంది
'దేవభాగు'ని శూరు(డై తేజ (గొనిన
'శతధనువు'ను పరాక్రమశాలియైన
ఘనుని 'కృత వర్మ' నాబడు తనయుల నిల(
బడసి నరపతి మోదంబు( బడసె మిగుల 92

దేవ మీఢుండును భూవలయంబులో
శూరుండనంగ సం స్తుతిని(బొంది
'మారిష' యన(బడు మానిని వలన నా
'వసుదేవ' విభుని సుబలు(డన(దగు
'దేవభాగు'ని గుణదీప్తితో మిగిలిన
దేవశ్రవు'ని బహు తేజు(డైన
'ఆనకుండ'ను వాని ఖ్యాతి(గొనిన
'సృంజయుండ'ను వాని చెలువు మీర
'శ్యామకుని' 'కంకుని' 'వనీకు' నాధ్యు(డైన
'వత్సకుని' 'వృకుని' ననెడు పదుగురుసుతు
లను బడసియు జీవితమున(దనివి నొందె;
సర్వ జనులిల (దిలకించి సన్నుతింప 93

'పృథ' ను 'శ్రుతదేవ'ను బహుళప్రేమ నొసగఁ
గలుగు 'శ్రుతకీర్తి'ని నమిత లలిత మగుచు
భాసిలెడు 'శ్రుతశ్రవస'ను వాసిఁగాంచి
వెలయు 'రాజాధిదేవ'ను వినుతి కెక్క
శూర నరపతి పొంది సుశ్లోకుఁడయ్యె 94

ధీరత మించి వెల్గు వసుదేవుఁడు పుట్టిన వేళ ఁబృధ్వి నిం
పారెడు లోకరంజనుఁడు నచ్యుతుఁడాతనికిన్ దనూజుఁడై
ధారుణిలో జనించునని ధాత వచింపగ 'నాకదుందుభు'ల్
తీరుగ మ్రోఁగె, దేవతలు తృప్తిగ నాడిరి, వ్యోమమందునన్ 95

ఆది నరేంద్ర ముఖ్యు లెనయౌదురు గాని మహోదయంబునన్
మేదిని నేటిరాజులుపమింప సమానులుగారు, దాన
మ్మోదికి ధైర్యధామునికి మోహన రూపకళా వినోదికిన్
హ్లాద మనో విహారికి, మహాత్మునకున్ వసుదేవ జానికిన్ 96

**మత్తకోకిల :**
వాసిఁగాంచిన కుంతి భోజు నివాస సౌధములోన దు
ర్వాస మౌని గరిష్ఠుఁడుండిన భక్తియుక్తిగ సేవలం
దాస మీరగఁగుంతి జేసిన నాత్మఁదృప్తిని మంత్రమా
*బాసవాల్దొర చెప్పె నామెకు ఁబారమార్థిక చింతనన్ 97

మంత్రోచ్చారణమున నా
మంత్రణ మొనరించెఁగుంతి భానుని మిగులన్
మంత్ర మహత్తున నిమిడిన
యంత్రణమున రవి దివి దిగి యువనిన్ జేరన్ 98

గుండియ దడదడలాడఁగ
నండన నున్నట్టి సూర్యు నర్థించెనిటుల్
దండము లివిగో భాస్కర!
దండించక మనుపు మయ్య! దాక్షిణ్య నిధీ!

* బాసవాల్దొర = ఋషీశ్వరుడప

మత్తకోకిల :

అట్టులాడిన కుంతి కప్పుడు నర్కుఁడిట్లనె మెప్పుగన్
ఇట్టు లాడెద వేలబేల? యికేల కంపము? రమ్మ, నీ
కిట్టి దైవము చెంతఁజేరునె ? యెన్ని నోములు నోచినన్
గట్టిపట్టును వీడుమింకిట కామినీ యని యంతటన్. 100

హరి మధ్యను హరివేణిని
హరి వాణిని బుజ్జగించి హరికూడి చనన్
సరిపడి సద్యః ఫలముగ
తరుణీమణి గర్భమూని తనయునిఁగనియెన్ 101

కటకటఁబడి యతివ మివుల
బొటబొట బాష్పంబు లొలుకఁబుత్రునిఁగనుచున్
అటమట మయ్యెన్ బ్రతుకని
యిటు లాలోచించెఁదా ప్రిణీయ హృదయమై 102

ఎన్నడులేని కాంక్ష మదినెందును గల్గెను? గల్గెఁబోవడిన్
మిన్నక మౌని యెందులకు మేలని మంత్రము జెప్పెఁ జెప్పెబో
క్రన్నన సూర్యునెందులకు రమ్మని పిల్చితి; బిల్చినాను బో
మిన్నగఁదాను వచ్చియొకమేలి సుతున్ దయఁజేసెనెందుకో? 103

కట్టా! శైశవ చాపలంబువలనన్ గంజారునిన్ గూడి యో
పట్టీ! *పక్కున నిన్నుఁగాంచితిని, నీపై మక్కువల్ చూపినన్
జుట్టా లెల్లరుఁ గేలిసేతురుకదా? చోద్యాన నిన్నోమినన్
నట్టేటన్ నినువేయలేను కొడుకా! నాకర్మ నన్నేచెడున్. 104

నిటల తలమ్ము దర్పణము, నేరిమిఁజాటు గళమ్ము శంఖమున్,
కటకట! కండ్లు కల్వలు, మొగమ్ము ప్రపూర్ణ శశాంకబింబమున్,
ఘటన శరీరసౌష్ఠవము, కంతుని రూపిది, వీడనెట్లొగిఁ
గటగట లాయె నా బ్రతుకు, కాలము కాటిడె నేమిసేతునో 105

---

* పక్కున = తటాలున, వెంటనే

కొడుకుల్ లేరని పుణ్యతీర్థములలో, గుండాలలో, మున్గుచున్
గడు కష్టంబులఁగాంచు వారలకిలన్ గల్గింగ మోదంబునన్
గడుపారన్ సుధనిచ్చి జోలనిడి నిన్ గాపాడరే పుత్రకా!
కడగండ్లన్ గలిగింప ఁబుట్టితివి, నాకర్మమ్ము నేమందునో 106

పెండ్లేనాకయి యున్నవేళ, సుతుఁడా! ప్రేమొప్పబాలిచ్చి నా
కండ్లారన్ నినుబెంచుదాన, నకటా! కన్యాత్వ దోషాన ని
న్నిండ్లన్ బెంచు విధానమే తొలగె; నిన్నేతల్లి పోషించునో
పండ్లన్ గాచిన చెట్టుకే తగులవే పాషాణ సంఘాతముల్! 107

చివురుల సెజ్జఁజేసితిని చిన్ని కుమార! పరుండవయ్య! నీ
కెవరిక దిక్కు? నేనెఱుఁగ నేటికి నాకు ఋణానుబంధమే
యవకటమయ్యె, వెళ్లెద, విహంగములార! మదీయ పుత్రునిన్
ధ్రువముగ ఁబ్రోవరండిక విరుద్ధమనంబుల సంచరింపకన్ 108

కోరిన కోర్కె తీరెనని కొండపయిన్ విహరించు భానుఁడా!
నేరక ఁజేసినట్టిదిది, నిందల పాలొనరింపజేసినన్
భైరవ యాతనన్ గలచె వైళముపుత్రుని నోము పద్ధతిన్
జేరి వచించుమో యనఘ! చేతులు మోడ్చెద లోకబాంధవా! 109

అంత భానుఁడు మందస మంపెఁదానిఁ
గుంతి కైకొన చివురులఁగూర్మి ఁబరచి
సుతుని బుజ్జండఁబెట్టి యుస్సురని మిగుల
నొడలు సొమ్మసిల కనుల నుడుకు వెడల. 110

**మంజరీద్విపద :**
పున్నమి చంద్రుని ఁబోలెడు మోము,
కమనీయతను గొన్న కంబుకంఠంబు,
బింబంబు డంబును మించు పెదవులు,
చిగురులన్ మించెడి చేతుల చెలువు
మెఱుపును హసియించు మేనుతళుకు
పువ్వుల కెనయైన నవ్వుల సొరు 111

అంతఁగండ్లు మూసి మంచసమ్మున మూఁత
వేసి కండ్లు ఁదెరచి వెక్కి వెక్కి
యేడ్చు కొనుచు నేల నిట్లాయె విధియని
గుండె కొట్టు కొనుచు ఁగుమిలి కుమిలి. 112

అంతట మూతనెత్తి తనయాత్మజు గుండెకు హత్తిహత్తి, యే
కాంతమునన్ సుతున్ విడువఁగాళులు సాగమి యేడ్చి యేడ్చి, వే
చింతల దోఁగి దోఁగి, యెటు చేయునొ దైవమటంచుఁబట్టి నిన్
వంతను పెట్టెలోనునిచి పట్టుగ మూతను మూసి దీనయై 113

అంత నద్దానిఁగైకొని యాసఁదీఱ
పాఱు జలమును వీక్షించి పడతి కుంతి
కాళ్లు విలవిల లాడగ ఁగడగి నిలచి
భావి జీవిత పథముపై భావ మూని 114

వణకు చేతుల పెట్టెను పట్టి, మెల్లఁ
గా, నదీ ప్రవాహజలము లానఁద్రోసి,
యలల ఁదేలియాడుచు ఁబోవు నట్టి దాని
చూచుచున్ వెన్దిరిగి కుంతి, సూనుఁదలఁచు 115

నెమ్మదిలోని యుమ్మలిక నిప్పుల మంచు దలంచుచున్ జనన్
సమ్మతి నెమ్మిఁగూర్చెడి ప్రశస్త సఖీజన మున్న చోటికిన్,
కమ్మని గాయనీమణులు గానములన్ మురిపించు వారికిన్
సమ్మద మొప్పగా వగపు చాయను దోపఁగనీక నింటికిన్ 116

అళులన్ బోలెడు యలకలు
జలజంబులఁబోలు కనులు జాబిలి కెనయౌ
లలిత ముఖముగల పృథన్
వలచి వడిన్ బాండు రాజు పరిణయ మాడెన్ 117

ధర్మస్థాపనలోన మేటి విలువిద్యన్ బెన్గదాప్రౌఢిమన్
మర్మంబుల్ గనుగొన్న శౌర్యధనులన్ బ్రావీణ్యులన్ గుంతి స
త్కర్మంబుల్ దగఁజేసి కాంచినది యాధాత్రీశు నాజ్ఞాపనన్
ధర్మోత్సాహులనన్ బరాక్రముల నాధర్మాది దేవాంశులన్ 118

వెలయు గారూషనృపుఁడైన వృద్ధశర్మ
ప్రేమఁ దిలకించి 'శ్రుతదేవి' ఁ బెండ్లియాడె
వారికి ముని శపించిన ఫలము వలన
'దంత వక్రుండ'నన్ బడు తనయుఁడొదవె. 119

పెప్పు మీఱ 'కేకయ' ధరణీశుఁడైన
'దుష్టకేతుండు' 'శ్రుతకీర్తి' నిష్టపడియు
పరిణయం బొనరింప నవ్వారి వలనఁ
బుట్టిరి 'ప్రతర్దనాదు' లేవురు ననంగ 120

అమిత సుందరియైన 'రాజాధిదేవి'
తీరుఁ దిలకించి 'జయత్సేను'ఁడెలమి
పెండ్లి యాడెను వారు సంప్రీతి ఁజెంద
నొప్పు 'విందాను విందులు' నుదయమైరి 121

చేది దేశాధినాథుఁడై చెలఁగెడి 'దమ
ఘోషుఁ' డా'శ్రుతశ్రవస'ను గూర్మితోడఁ
బరిణయంబాడగా 'శిశుపాలు' ఁడొకఁడు
ప్రభువ మొందఁగా నవ్వాని వలన నవని. 122

అల వసుదేవుని యనుజుల
విలసిల్లెడు సంతతిని సవిస్తర మేనున్
తెలిపెద వినుఁడిదె జగతిఁ
గలకాలము సౌఖ్యగరిమఁగలిగెడు కరణిన్ 123

'దేవభాగుండు' యశమంది దివ్యుఁడగుచు
'కంస'ను వివాహమాడి యాకాంత వలన
జెలగు 'చిత్రకేతు' 'బృహద్బలు' లను సుతుల
నిర్వ్వరన్ గాంచి, తమి నొంది 'నిన్పుఁ' బడసె 124

కడగి దేవశ్రవుం డల 'కంసవతి' ని
నాత్మ మీఱగఁబెండ్లాడి యామె వలన
'వీరుడు' 'నిషుమంతు' ఁడనెడు వారి ఁబడసి
బహుళ సంతోషమును గాంచె వసుధ లోన 125

'కుంకు' డానంద యుక్తుఁడై 'కంక' యనెడు
నింతిఁ బెండ్లాడి వడిగ నా నెలఁతవలన
'బకుని' 'సత్యజిత్తు' ని కడు వాసిఁగాంచి
తనరు 'బురుజిత్తు' నాబడు సుతులఁబడసె 126

ధరణీస్థలిలో 'శ్యాముఁడు'
'సురభూమిని' ఁబెండ్లి యాడి సుశ్లోకుండై
'హరికేశ' 'హిరణ్యాక్షుల
వరుసన్నామె వలన వడిఁబడసెన్ బ్రీతిన్ 127

'వత్సకుండు' భువిని భాసుర భానుఁడై
'మిశ్రకేశి' ఁగాంచి మేటి బోటి
యనుచు ఁబెండ్లియాడి యామె వలన
నల 'వృకాది' సుతుల ఁగలుగ' జేసె 128

'వృకుఁడు' 'దుర్వాక్షి' ఁదిలకించి ప్రియముఁజెంది
పరిణయంబంది యామెచేఁ బలిమ మీఱ
'దక్ష, పుష్కర, సాళ్వాది' ధైర్య ధనులఁ
బడసి భవ్య సౌఖ్యములంది వాసి ఁగాంచె 129

పరమోదాత్తుఁడునౌ 'యనీకుఁడు'ను సంభావ్యానుకూలాంగనన్
వరసౌందర్యవతిన్ 'సుధామని'ని పెంపారంగఁబెండ్లాడి యి
ద్ధరణిన్ నోములు పండెనో! యన 'సుమిత్రా' నీక'బాణా'దులన్
మరులున్ దీఱగఁదానుగాంచెఁగద సంభావ్యంబు సంధిల్లఁగన్ 130

'ఆనకుండ'ల 'కర్ణిక' యనెడు చాన
వలన 'ఋతధామ' 'జయు'లను వాసిఁబడసి
ప్రగతి పథమున ఁబయనించి ప్రజలు వొగడ
రాజ్య చక్రంబుఁ ద్రిప్పె రారాజు వోలె! 131

వసుదేవుని గుణధాముని
అసమానుఁడన భువిలోన నాతని సంతుఁ
వెసఁదెలిపెద వినుఁడిక నీ
వసుధన్ పుణ్యంబు మీకు వాసిగ వెలయఁ 132

అలరఁగ వసుదేవుఁ డా 'రోహిణి' వలన
'గదుఁడు' 'సారణుండు' కస్తి ఁబాపు
'దుర్మదుఁడు' 'విపులుఁడు' 'ధ్రువుఁడు' 'కృతాదుల'ఁ
బుట్టఁజేసెను, జనులెల్లఁబొగడు నటుల 133

ఆదరమొప్పనాతఁడు మహత్తర 'పౌరవి' ఁజెట్టఁబట్టి స
మ్మోదమునన్ 'సుభద్రుని' ప్రముఖ్యుని మాన్యుని భద్రబాహునిన్
సాదులఁగాచు దుర్మదుని చక్కని భద్రుని ప్రౌఢిమీర భూ
తాదులఁ బొందె నామెవలనన్ ప్రజలందఱు నిచ్చమెచ్చఁగన్ 134

విందుల నందఁగ నాతఁడు
నందంబగు 'మదిర' వలన నల 'నందోపా
నంద' కృతు కశ్రుతుల ఁబెం
పొందగ శూరాదుల ఁదగఁబుట్టినయంతన్ 135

'కౌసల్య' యందు 'కేశిని'
భాసురవునఁబుట్టెఁదానఁబ్రాబల్యమునన్
హాసవిలాసము లందెను.
నాసక్తిన్ జీవితంబు నానందముగాన్ 136

సొంపుగ 'రోచన' వలనన్
ఇంపెసలారంగ హస్త, 'హేమాంగా' దుల్
బెంపుగ నతనికిఁ గల్గిరి
తెంపున నవ్వారు కీర్తిఁదెచ్చిరి, ధరణిన్, 137

వర సౌందర్యాంగనయై
పరగెడి నానిళల వలనఁబటు యదుముఖ్యుల్
ధర వల్క్వ లాదులతనికి
పరువుగ నుదయించినారు వైభవ లీలన్ 138

వెలయు 'ధృతదేవ' యందుఁ 'బ్రవృష్ఠ'ఁ డొదవె
దీప్తితో ఁబరగెడు 'శాంతిదేవ' యందు
'బ్రశ్రమ, ప్రశ్రి' తాదులు రాజిలంగ
జనన మందిరి, వసుదేవు స్వాంత మలర 139

వసుధ 'సుపదేవి' యందున వాసిఁ గొనిన
కల్పవృష్ట్యాది పదుగురు కల్గిరెలమి
వారిఁబరికించి యాతఁడు భాగ్యమలరఁ
బరగ సంతోషమును బొందె భద్రమెసఁగ. 140

చెలగు 'శ్రీదేవి' యందు విశిష్టులగుచు
నలరు 'వసుహంస' మఱియు సుధన్వాదులనెడు
యార్గు రుదయించి తనరిరి యతని కపుడు
నిత్య సంతోష సంపత్తి నెగడె మివుల 141

అతుల సౌందర్య సహదేవ' యనెడునింతి
యందు నాతఁడు మిగుల నానంద మొప్ప
నిలఁబురూథ శ్రుతాదుల నింపు నింపఁ
బుట్టఁజేసెను సురలెల్లఁబొగడునటుల 142

అలరు 'దేవకీ' దేవికి నమరు' కీర్తి
మంతుఁడును, 'వృషేణుఁడును 'భద్రసేను'ఁ
డతుల 'ఋజువు' ను 'శమధనుం' డమలు డనెడివారు
'భద్ర, సంకర్షణా'డులు పరగ నేడ్వు
రుదయమందిరి, వసుదేవుఁ డుల్లసిల్ల 143

ఇష్టుఁడు లోకనాయకుఁడనేక మునీంద్ర సురేంద్ర వంద్యుఁడున్
దుష్ట మదాంధరాక్షసుల దూఁణవినిర్గత సాయకావళిన్
దృష్టిఁగూల్చు మాధవుఁడు, తోయజనేత్రుఁడు, పుట్టె దేవకీ
యష్టమ గర్భమందున సురావళి నోచిన నోము గోమినన్! 144

అచ్యుతుండు నుదయ మందిన తర్వాత
తృప్తి మనము లోనఁదేజరిల్ల
విగత కలుషయైన వెలది యా దేవకి
భద్ర మిడు 'సుభద్ర' ఁబరగఁబడసె. 145

పంచచామరము :
సుభద్ర నర్జు నుండు గాంచి చోద్యమంది యంతటన్
శుభంబు మీఱఁబెండ్లియాడి శూరునిన్ బలాఢ్యునిన్
ప్రభావధుర్య 'నాభిమన్యు' బాలవీర యోధునిన్
శుభోదయున్ గుమారునిన్ యశోధనున్ గనెన్ మహిన్. 146

యాదవ వంశక్రమమును
సాదరమున శుకమహర్షి చక్కఁగ నుడువన్
మోదముఁగొనె ధరణీశుఁడు
తాఁదదుపరి శివుని నిటుల ధ్యానముఁజేసెన్ 147

మల్లికా వృత్తము :
శ్రీమహితాత్మక! మృత్యుంజయ! శ
ర్వా! మహదేవ! భవా! భూతపతీ!
కామ వినిగ్రహా! గంగాధర! శ్రీ
హైమవతీప్రియ! యైశ్వర్యప్రదా! 148

విమానము :
దివా నిశప్రార్థనాళిన్
శివా నినున్ వేడినంతన్
అవాంతరాఘాది దోషాల్
అవే తొలంగున్ ధరిత్రిన్ 149

పంచచామరము :
దురాశ నాశ! యభ్రకేశ! దోషదూర! యీశ్వరా!
పురారి! శూలధారి! భస్మభూషితాంగ! సుందరా!
నరేంద్ర! సోమనాథ! వైద్యనాథ! కాళికేశ్వరా!
నిరంతరంబు గొల్చుచుందు నీలకంఠ! బ్రోవుమా! 150

కమల విలసితము – పంచపాది :
విజయము కుముదము వికసన లొప్పన్
కుజనుల దనుజుల కుతుకలు గోసే
నిజమగు విభుఁడవు నిఖిలము నీవే
యజితుఁడ వెవరికి హరహర! కానన్
భజనల సలిపెద వరమిడు దేవా! 151

**పద్మనాభము :**
గౌరీశ! లోకేశ! మౌనీంద్ర! సంపూర్ణ కారుణ్య! కైలాస! మహేశా!
శ్రీరమ్య! శ్రీశైలమల్లేశ! భూతేశ! శ్రీకాళహస్తీశ! ఆకాశ కేశా
వీరాధివీరా! శుభాకార! శృంగార! వేదాంతసంచార! లోకోపకారా
మారేడు పత్రాల బూజింతు నోదేవ! మమ్మేల రావయ్య! సర్వప్రకాశా! 152

గద్యము

**శ్రీ కొమర్ల గోత్ర పవిత్ర నాగయ పౌత్ర, గోపాలయ ప్రథమ పుత్ర**
**శ్రీగుండాల కోనేశ్వర కరుణాకటాక్ష లబ్ధ కవితావిచక్షణ**
బొడ్డుబోయిన వేంకటనారాయణ ప్రణీతంబైన
గోకులాభ్యుదయంబను ప్రబంధంబున
ద్వితీయాశ్వాసము

# గోకులాభ్యుదయము

## తృతీయాశ్వాసము

శ్రీ గౌరీశ్వర! స్మరహర!
నాగేంద్ర ఫణీకలాప! న్యాయాధ్యక్షా!
యోగీంద్ర హృదయ భూషణ!
శ్రీగిరివాసా! గిరీశ! చిన్మయహాసా! 1

ఆ పరీక్షిన్నరేంద్రుండు నాసఁదీర
యాదవాన్వయ క్రమమెల్ల నాలకించి
నంత శుకయోగి న్నుతించె నమిత భక్తిఁ
జెలగు శ్రీ కృష్ణ లీలలఁ జెప్పుమనుచు 2

అనవిని శుకయోగీంద్రుఁడు
మనమున సంతోషమంది మోక్షాధారం
బనఁదగు కృష్ణుని లీలలు
వినుమని వివరించెనిటుల పృథ్వీపతికిన్ 3

**మత్తకోకిల :**
శ్రీవిరాజితు నప్రమేయుని ఁజిత్ప్రకాశితు విష్ణునిన్
దేవ దేవుని లోకనాయకు దీనబాంధవు నీశ్వరున్
జీవ కోటినిఁబెంచు శౌరిని శేష శాయిని ఁజేరి భూ
దేవి చెప్పెనిటుల్ హృదంతర దీనవైఖరియేర్పడన్ 4

దనుజ వృద్ధివలన ధారుణి బరువాయె
మోయ జాల నేను మురవిదార!
అందువలన మీర లవతారమెత్తఁగా
వలయు భువిని భక్త పారిజాత! 5

అనుడు శౌరి హృదిని నానంద మందుచు
నొప్పుకొనియె; నామె యుత్సహించి
వెళ్లిపోయె; నంత వేల్పులు విచ్చేసి
విష్ణునెలమిఁగొల్చివేడ్క వెలయ 6

మ్రొక్కిన సురలన్ జిష్ణుఁడు
గ్రక్కున దీవించి మదిని కల్గిన వాంఛన్
జక్కగ వారికిఁదెల్పిన
నొక్కమ్మడి వారలనిరి యుత్సాహమునన్ 7

ధీకర్వై మాపాలిటి
శ్రీకరివై మమ్ముఁగాచు శ్రీనాథుఁడవై
మాకున్ మందారమవై
ప్రాకటముగ వెలయు మమ్ము బాయుట తగునా! 8

యదువంశాంబుధిలో
నుదయింపన్ మేము నిన్ను నుర్వీస్థలిలో
ముదమున వేడుట కొఱకై
యదువంశంబున జనింప ననుమతి నిమ్మా! 9

అని వనజాక్షుని వేడిన
ముని వంద్యుం డొప్పుకొనియె, ముచ్చటపడి యా
యనిమిషు లరిగిరి శ్రద్ధన్
వినుచుండిన శేషుఁడిటుల వెన్నుని వేడెన్ 10

నిన్ను విడచి నేను వెన్నయ్య! యెట్లుందు
వేడ్క మీఱ నన్ను వెంటఁగొనుఁడు
అటుల సేయ కున్న నడియాసతో నేను
కుములు చుందు నిజము కునుకు విడచి. 11

అనుడు శేషశాయి యాదిశేషుని ఘన
తనువు నిమిరి యిట్టు లనియెఁగరుణఁ
జింతఁజేయ వలదు, క్షితిని నాకన్నవై
జన్మఁగాంచఁగలవు, జనులు పొగడ 12

ధర్మ ముద్ధరింపఁదలపోసి విష్ణుండు
నవని నుద్ధరింప నాత్మఁగోరె,
దాని నెఱిగి ఋషులు ధర్మార్థ వేద్యులు
దిగులు విడచి మిగుల తృప్తి పడిరి. 13

మధుర రాజధానిగఁగొని మాధురులన
శూర సేనములనఁబడు స్తుతులఁబడసి
సొంపు నింపెడు దేశాల శూరసేన
విభుఁడు పరిపాలనముఁజేసి వేడ్క మీర 14

గగనమున్ జుంబించు ఘన సౌధములతోడ
సర్వసంపన్నులౌ జనులతోడ
నైశ్వర్యమందించు నాలమందలతోడ
ముక్కారుఁబండెడు పొలముతోడ
వేదాలు వల్లించు విప్రవర్యులతోడఁ
బరమేశు గీతికా ధ్వనుల తోడ
వైభవంబును జాటు పాడిపంటలతోడ
నింపు సొంపగు చెట్ల పెంపుతోడ
భక్తి తత్పరులైనట్టి ప్రజల తోడ
బలిని సరివోలు దాతల బలిమి తోడ
కవితలన్ వ్రాసి మెప్పించు కవుల తోడ
మధుర రాజిల్లె జగతిలో మాన్యమగుచు 15

శూరుని పుత్రుఁడై, విమలశోభితుఁడై, జగదేక వంద్యుఁడై
ధీర గుణాఢ్యుఁడైన వసుదేవుఁడు మాన్యుఁడు దేవకీ సతిన్
బేరిమిఁబెండ్లిఁజేసికొని పెద్దల దీవనలంది రాణితో
భూరి యశమ్మునన్ దనదుప్రోలుకుఁదాబయనమ్ముఁగట్టఁగన్ 16

దేవకీ వసుదేవులన్ దీప్తి ధనుల
నరదమందిడు కొనుచుఁబ్రహర్ష మతిని
సారథిగఁగంస భూపతి సాగునపుడు
వినఁబడెన్ వాక్కు లిటు వినువీథి నుండి 17

కమలనాభుండు అష్టమ గర్భమందు
దేవకీ దేవి కుదయించు ఁబావనముగ
కంస! నీకతఁడహితుఁడై కయ్యమందు
నిన్ను ఁజంపును; నామాట నిజము! నిజము! 18

అనుచు నాకాశ వాణి యా పట్టునందు
భావిగతి వార్త నెఱిగించె, బ్రస్ఫుటముగ
నదియు వినినంత గంసుండు నలుకఁజెంది
దేవకిఁ జేరి తద్విధిఁ దెలిసి వాఁడు! 19

మత్తకోకిల :
భిండివాలము ఖడ్గమున్ గొని భీకరాకృతిఁదాల్చి యా
ఖండలుండిట జేరినన్ నిను గావఁజాలఁడు ధారుణిన్
గండలన్నియుఁ గోసివేసెద, ఖండితంబని పల్కుచున్,
జండశాసను వోలె దూకెను సాధ్విఁజంపఁగనొయ్యనన్. 20

వసుదేవుండట, కసితోఁ
గసరుచు కరవాలమెత్తి కంఠము నరుకన్
వెసఁ బైపడు కంసుని సా
హసమున దానొడసి పట్టి యనె నీరీతిన్. 21

బావ! యశరీర వాక్కులు వసుధ లోన
నిజము లగునని తలపోసి నెమ్మి దొరఁగి
తోడఁబుట్టును ఖండింప దోషమొదవు,
ఆగ్రహంబును వీడుమా, యాదరమున 22

అన్నవు నీవు, చెల్లెలికి నాదర మొప్పగ జీరలీయకే
మన్నన జూపగా మధుర మంజుల వాక్కుల గాన్క లీయకే
యున్నత బుద్ధినూనుకొని యోజన నల్లెము నీ వొసంగకే
గ్రన్నన దన్వినిన్ దునుమఁగా దగునా మది నెంచి చూడుమా! 23

పుట్టి గిట్టు టనఁగ భువిలోన సహజమ్ము,
పడతిఁ జంపు వాఁడు పరువుఁగొనఁడు
నీతిరీతి నెఱఁగి నిలచిన వానికి
యశము కల్గు బావ! యవనిలోన 24

అలుగుఁజేతఁబట్టి యనుజాత కొదవిన
సుతులఁజంపవచ్చు వెతలు రావు,
హిత మెఱింగి నీవు నుతిగాంచగా నెంచి
సుదతిఁబ్రోవుమయ్య! సుజన వంద్య! 25

అనుఁడు కంసుఁడెలమి నాగ్రహంబునువీడ,
దిగులు బాసిన వసుదేవుఁడంత
తరుణి వెంట నడువ తన ప్రోలు చేరెను
పౌరులున్ ముదమున స్వాగతింప! 26

పుత్రులేడ్వురు వసుదేవ పుడమి పతికి
కలిగి నంతట వారలఁ గంసుకడకుఁ
జేర్చ నాతఁడు శిశువుల౯ *జిద్ది మాని
చంపక విఁడచె దివ్యు లాశ్చర్యమంద! 27

నీరద నిర్మల దేహుఁడు
పోరామిన్ బోరుఁబెట్టి పోడిమిఁబొందే
నారదముని కంసునిఁగని
తీరుగ వాక్రుచ్చె నిటుల తీఱిమి కలుగన్ 28

తుష్టిని దేవకీ రమణి తోయజనేత్రుని, విష్ణుమూర్తినిన్
దుష్టుల ఁగూల్చు శ్రీకరుని, దోష విదూరుని, లోకనాయకున్
సృష్టికి మూలకారకుని, కృష్ణుని, యష్టమ గర్భమందునన్,
క్లిష్టము ఁబాపగాఁగనును లీలను, నిన్ బరిమార్చు నాతఁడే. 29

తగవు నెఱపు కొఱకు ధారుణీస్థలిలోన
నమర గణము లెలమి యాదవులయి
కృష్ణుఁగొలుచుచుంద్రు కీర్తన లొప్పార
భావిఁ దెలిసి నేను పలికినాను. 30

*జిద్ది : కోపము

అనుఁడు కంసుఁడాత్మ నారాటమును బొంది
దివ్య గుణులగు వసుదేవసుతుల
గండు కత్తి చేత ఖండించి దనుమాడె
జీవ కోటు లెల్లఁజింత నొంద. 31

కంసుఁడొనరించు హింసలుగాంచి హరియు
యోగ మాయను బిల్వగా నుత్సహింప
నామె వచ్చెను; శ్రీహరి యామె కిటులఁ
బల్కె, విధి విధానములెల్ల బయలుపరచి 32

చెలఁగున్ దేవకి గర్భమందున ప్రసిద్ధంబైన శేషాఖ్యతో
వెలుఁగున్ బొందెడు నాదుతేజమును సంప్రీతిన్ విలోకించియా
లలనన్ డాసియు గర్భమున్ దిగిచి వైళంబొప్పనద్దాని నీ
వలరన్ రోహిణి గర్భమం దునుచుమా, యాలస్యమున్ జేయకన్ 33
తదుపరి నేనా దేవకి
యుదరంబున జేరుకొందు నొప్పుగ నీవే
యుదయించు మాయశోదకు
ముదమున నీ జన్మ మాన్యమున్ గొను ధరణిన్ 34

**అంబురుహము:**
దేవకి గర్భముఁదాలిచి చిత్రగతిన్ రహించు వేళ సం
భావముఁబొందగ నారదమౌని శుభంబనన్ బలికెన్నిటుల్
దేవుఁడు నచ్యుతుఁడీశుఁడు మాన్యుఁడు దేవకీ సతి కింపుగా
భూవలయాన జనించుట తథ్యము *పోక డించును దైత్యులన్. 35

అనుడు దేవకీ వసుదేవు లాశఁదీఱ
వేదవంద్యుని విష్ణుని వేడినంత
విష్ణుఁడామాత యుదరాన వృద్ధినొంద
నూతన వికాస మామెలో నూలు కొనియె 36

---

* పోక = కపటత్వము, మాయ - పోకు = మాయచేష్టలు

దేవకి గర్భమూనెనని తెప్పున (గంసుఁడె జెంగి చెల్లెలిన్
బావను బందిఖాననిడి వాకిలి తల్పులు గట్టి బీగముల్
మూవడఁజేసి కింకరుల ముందునఁగావలిఁబెట్టి చెచ్చెరన్
దావెడలెన్ మనోవ్యధను, తప్పునెయాతన క్రూరవర్తికిన్? 37

కటిక చీఁకటిగల 'బందిఖాన'లోన
జంకు కొంకును విడనాడి సంబరమున
దేవకీ వసుదేవులు దేవ దేవు
నచ్యుతుని గొల్చు చుండి రనంత భక్తి 38

నీరధు లెల్లఁబొంగినవి నీరజముల్ వికసించె, హర్షమే
చేరెను మౌని సంఘముల; ( జింతలభీతిలె దైత్య బృందముల్,
చోరులుఁబారిపోయిరెటొ, శోభలు నిండిన వన్ని దిక్కులన్
ధీరుఁడు చిన్ని కృష్ణుఁడల దేవకికిన్ జనియించు వేళలో 39

పూల వానలు వర్షించె ( బుడమిలోన,
దేవ లోకాన దివ్యులు తేజరిలిరి,
కృష్ణుఁజిష్ణుని శౌరిని కీర్తి ధనుని
వెలయు దేవకి నీల్గాడు వేళయందు 40

పార్వతీశుఁడు జేజేలు పలుకుచుండ
మింటిపై శుభగ్రహములు మెఱపులీన
సురలు దివిపైన నాడెడు తరుణమందు
పుత్రుఁ గనె నిశిన్ దేవకి పూతచరిత! 41

శంఖ చక్రధారు జలధర దేహుని
నిహపరముల నిడు మునీంద్ర నుతుని
శ్రీకళాప్రసన్ను శ్రీవత్సలాంఛను
దేవ వంద్యుని వసుదేవుఁడరసి 42

కంసుని మారకునిన్ గుల
పాంసను నజ్ఞత్వమునకు భయకంపితుఁడై
కంసారి నోముటెట్లని
★హంసుని వసుదేవుఁడిటుల నడిగెన్ బ్రీతిన్ 43

హంసుడు = సూర్యుడు, విష్ణువు, శివుఁడు, జీవుఁడు

ద్వారము లెల్ల మూసి పెనుతాళము లేసిరి నాల్గుదిక్కులన్
దారి యొకింతలేదు, బహుధా నినువేడఁగ నోడుదున్, హరీ!
వారిజ పత్రనేత్ర! విను, వైళమ కంసుని బారినుండి యే
నేరిమి నిన్నుఁగాచెదనొ? నిష్క్రియుఁడన్దగురీతిఁ దెల్పుమా! 44

ఏసఁగెడు పల్కుల నవ్విధి
వసుదేవుఁడు నుడివినంత బాలుండెలమిన్
ముసి ముసి నవ్వులు నవ్వుచు
వెసవాక్రుచ్చె నిటులఁగడు వేడ్కచెలంగన్ 45

**మంజరీ ద్విపద :**
వినుము చెప్పెదనీకు విశదంబుగాను
సరగునా నాపాద స్పర్శము వలన
తలుపు లన్నియు వీడు తథ్యంబుగాను
యోగమాయాదేవి యుదయంబు నొందె
నా యశోదమ్మకు ననుగుఁ గూతురన
నీవు నన్ గొని పోయి నియతి నన్నుంచి
యోగ మాయాదేవి నుంచు మిచ్చోట
సంకటంబు లడంగి సంతోష మొదవు! 46

దివ్య వాక్కులేయని వసుదేవుఁ డెఱిగి
బాల భానునిఁ బోలెడు బాలునంత
హస్త యుగమున నెత్తికొంచా నిశీథి
బయలు దేరెను నందుని భవనమునకు 47

అమితోత్తుంగ తరంగ సంఘములతో, నానీక భాగ్యంబుతో,
భ్రమలన్ గూర్చు మృదంగ నాదముల విస్ఫారంబుతో, శక్తితో
నమలంబైన జలంబుతో, మహిమతో, నక్రాంత సత్కీర్తితో,
యమునా హ్రాదిని కీర్తిఁగాంచినది పుణ్యాధార సంధానియై. 48

వసుదేవుఁడు యమునన్ గని
వ్యసనంబున వేడినంత నది దారినిడెన్
వెసఁబయనించి యశోద గ
ల సదనమును జేరె విభుఁడు లాలితబుద్ధిన్. 49

అతిరయాన యశోదమ్మ యండఁజేరి,
బాలు నాయింతి ప్రక్కలో ఁబండఁబెట్టి
బాలికన్ దెచ్చి దేవకీ ప్రక్కనుంచ
నేడ్వసాగె నబ్బాలిక యెక్కుపెట్టి. 50

అంత కావలి వారలు నచటి నుండి
కంసు దరిఁజేరి దేవకి కందుఁగనియె,
నంచు విజ్ఞాపనముఁజేయ నతఁడు కార
కడకు వచ్చి బిడ్డను జంపఁగత్తి నెత్తె. 51

అట్టి యదనున దేవకి యిట్టులనియె
యధిప! కినుకేల? తొందర నందనేల?
యాడబిడ్డను గంటిని, యన్న! అదిగొ,
చూడు, చంపక విడువుము చుఱుకు వలదు. 52

అన్న! క్షమింపుమన్న! కరుణాంబుధి వీవని నిన్ను వేడెదన్
అన్నెము పున్నెమున్ గనని యాత్మజ యియ్యది చంపపాడి కా
దన్న! శరీరధారులకు నాపదలన్ గలిగింప మేలుకా
దన్న! సుకీర్తిచే బ్రతుకు మన్న! వధించకు మేలు నీకగున్ 53

పుత్రులు శాత్రవులని తా
పత్రయపడి చంపినావు, బాపురె!వారిన్
బుత్రిక భూతల ధాత్రిన్
శత్రువుగా మారి నిన్ను ఁజంపన్ గలదే? 54

మింటిని విన్న వాక్కులు గణింపక రిత్తకురిత్త పుత్రికన్
గంటిక బుద్ధిచే దునుమ న్యాయము కాదనియెంతఁజెప్పినన్
గెంటెదవేల? జీవులకు ఖేద మొనర్చుట నీకు హర్షమా?
తుంటరి కోర్కె లెందులకు?ద్రోహినశించు నశేషవేదనన్. 55

అనుడు కంసుండు హితబోధ కాగ్రహించి
మింటి వాక్కులు మెదడులో మెదలుచుండ
చిట్టి పాపను గట్టిగాఁబట్టి,పట్టు
బెడసి పడునట్టు నింగికి విసరవైచె. 56

శంఖ చక్ర పద్మ సంయుక్త సంజాత
శూలపాణి మునుల నేలు రాణి,
దివ్య మణుల చేత దీపించు నబ్బాల
నాకసంబుఁజేరి యనియె నిటుల 57

అన్నలఁజంపినావు కఠినాత్ముఁడవీవు,యశోదపుత్రుఁడై
చెన్నుగ నున్న వాఁడు, జయశీలుఁడునై జగదేకవంద్యుఁడై
కన్నడునై ప్రసిద్ధిఁగొని గర్వ మదాంధ సురారి వర్గమున్,
నిన్ను వధించు తథ్యముగ; నిక్కడు వాఁడిల నీల్గ కుండునా? 58

అనుడు కంసుఁడంత నారాటమున్ గాంచి
దైవ నిర్ణయంబుఁ దలఁచి తలఁచి
గతములోని బ్రతుకు కడుమంచిదని యెంచి
వెఱపు మదినిఁజేర వెడలిపోయె 59

నందనుఁడు లేని నందుఁడు
నందనుఁడే తనకుఁగల్గెననుచు మిగులనా
నందనుఁడై యాచకులకుఁ
బొందుగ దానంబులిచ్చె భూషణ తతులన్. 60

పురిటి సంబరంబు పొలుపుగా జరిపించి,
పైడి యూయలందు బాలునుంచి,
హరి!ముకుంద!యనుచు నంగనల్ జోలల
నెలమిఁ బాడిరపుడు నేర్పు మీఱ! 61

వారిజనేత్రుని శ్యామా
కారుని దైత్యహరుని జగదాధారున్
ధీరునిఁజూచిన చానలు
పేరిమితోఁగృష్ణుఁడనెడు పేరిడిరెలమిన్! 62

కనికర మింతలేని యపకారుఁడు కంసుఁడు కృష్ణుఁజంపఁబూ
తన యనుదానిఁబంప నది దారుణమైన విషంబు ఁజన్నులన్
జనవునఁబూని శ్రీహరికి చన్గుడుపన్ వెస దుగ్ధ మాంసముల్
తనరుచుఁ బీల్చి రక్కసిని తాను వధించెను శక్తియుక్తుడై. 63

శకటాసురునిన్ గంసుఁడు
శుకయోగీంద్రవంద్యు శుభకరు ఁగృష్ణున్
శకటమున దునుమఁబనుపన్
శకటంబును హరియె ద్రుంచి జంపెన్ దైత్యున్. 64

బహు నీచాత్ముఁడు కంసుఁడంతట తృణావర్తునిన్ జీరి,
న్మహితాధుర్యుని కృష్ణుఁజంపుమని యానన్‌జేయ నుద్యుక్తుఁడై,
యహితుండై సురగాలియై హరినిఁదానాకాశ మందెత్తఁగా
నహహా! శ్రీహరి వాని కంఠమును నొక్కన్ ద్రెళ్లె నా దైత్యుఁడున్ 65

మన్నును దినె కృష్ణుండని
మన్నించక యా యశోద మాధవు ఁగొట్టన్
మన్నేదిట? మాతా! యని
వెన్నునుదిను నోరఁదెరచి విశ్వముఁజూపెన్ 66

బాలకృష్ణుని యల్లరి పనులఁగాంచి
యా యశోదమ్మ కోపించి హరినిఁబిల్చి,
త్రాడు గొనితెచ్చి రోటికి ఁదనరఁగట్ట,
లాగె, నద్దాని శ్రీహరి లావు మీఱ! 67

కాళిందీ జలముల్ విషోగ్రములునై కాళీయుఁడుంటన్ బ్రజల్
జాలన్ గాసిలఁగన్ వడిన్ హ్రదమునన్ సర్పంబు గర్వంబు పోన్
లీలాత్మన్ నటియింపఁబైపడగలన్ నేర్పొప్ప ఁబైకెక్కి తాన్
వ్యాళంబున్ గడునొంప వాఁడు నభయమ్మర్థించె శ్రీకృష్ణునిన్! 68

మత్తకోకిల:
గోపబాలుర్పైన ధాత ప్రకోపమూని, చివాలునన్
దాపునన్ గల వత్ససంఘము దాచివైచిన వారలా
పాపదూరుని భక్త వత్సలు బాల కృష్ణుని వేడినన్
బ్రాపు ఁజూపుచు వాని నన్నిటి వారికిచ్చెను జిష్ణుఁడై 69

సుగంధి:
పర్వతప్రదక్షిణాన వాసిఁగొన్న యాదవుల్
సర్వ వంద్యుఁగృష్ణుఁగొల్వ శక్రుఁడల్గి వార్పై
గర్వమొప్ప ఱాల వాన గాసిఁగూర్పఁగుర్వఁగన్
పర్వతంబు వ్రేల నెత్తి వారి నోమె మాన్యుఁడై 70

వత్సాసురుఁడొక్కడు కడు
కుత్సితుఁడై యాలమందు ఁగూల్చుట గనుచున్
వాత్సల్యుఁడైన హరి యా
వత్సాసురుఁజంపి కీర్తి వడసెన్ జగతిన్. 71

గోవుల నెల్లఁదోలుకొని గోపకుమారులు కాననుండగా
దావము వారిఁజుట్టుకొన, దైన్యతఁజేరి మనోజ్ఞుఁగృష్ణునిన్
బ్రోవుము పాహి!పాహి! యని పూజ్యుని వేడిన శౌరియంతటన్
దావము మ్రింగవేసెనట, తాదృశ కార్యము ఁగాంచలేమిలన్. 72

క్రౌంచపదము:
క్రౌంచము వోలెన్ వంచనుఁడై రాక్షసుఁడు పటు బలము ఁగలిగినవాఁడై
యంచెలనాలన్ జంచువునన్ బాయక పొడిచి పొడిచి యడచు నసాధ్యున్
యంచిత యుక్తిన్ మించిన శౌర్యంబనఁగ హరి వడినినసురుని గ్రూరున్
బంచన ఁజే రా చంచువు ఁజీల్పన్ వడిఁబడి దనుజుఁడు మడిసె దురాశన్73

కొమ్ముల నాలబోతువలెఁ గ్రూర నిశాచరుఁడొక్కరుండు కో
పమ్మున నాలమందలను వత్సములన్ గని భీకరాకృతిన్,
గొమ్ములఁగుమ్మి క్షోభలిడ గోపకులెల్ల ముకుందు వేడఁగన్
సమ్మతి ఁజంపె నా ఖలుని శౌరికి మించిన దేవుఁడుండునే ? 74

మందాక్రాంతము:
కేశి వ్యోమాసురులు ఖలులై కేకలన్ గోవులన్
యాశాంతాంతమ్ముల ఁదరుమగా యాదవుల్ దేవ!స
ర్వేశా!లోకేశ! యనిపిలువన్ వేడ్క నాదైత్యులన్
నాశిల్లన్ జేసెను హరి, సురల్ నాట్యముల్ చేయఁగన్. 75

వలయాకారము మీఱ గోపికలు శ్రీవైకుంఠునిన్ జుట్టియు
జ్వల పాదంబుల నాట్యకేళి చెలఁగన్ వర్ధిల్లు చిద్రూప శో
భల నొక్కొక్క ప్రియాంగనా హృదయ భావంబుల్ రహిన్ దీర్పవ
ర్తిలు శ్రీకృష్ణుని లీలలెన్నఁదరమే దీప్తిౕ మహోజ్జ్వానికిన్. 76

ధరణి నఘుఁడనన్ బరగు దైత్యుఁడు భూరి భుజంగరూపుఁడై
తిరిగెడు గోప బాలకుల తిన్నని లేగల మ్రింగఁగృష్ణుఁడా
యురగము కుత్తుకన్జని మహోజ్జ్వల యాకృతిఁబెంచి త్రుంపఁగన్
సరగున లేగలున్ బ్రతికె, చావకపోయిరి గోపబాలకుల్. 77

అరయ మున్ను రుక్మి పరమాత్ముని ఁగృష్ణుని దూరి సోదరిన్
పౌరుష హీనుఁడైన శిశుపాలుని జీరి వివాహ కార్యమున్
తీరుగఁ జేయువేళ పటుధైర్యుఁడు శౌరియెఱింగి యంతటన్
వైరుల నాజిలో గెలిచి వాసిగఁజేకొనె రుక్మిణీ మణిన్. 78

ధారుణి దంతవక్త్రుఁడను దైత్యుఁడు ఘోర గదా యుధంబునన్
వారిజనాభునిన్ బిలచి శ్వాసము వీడ శిరంబుపైనఁదా
దారుణ లీలమోదిన గదన్ గొని కృష్ణుఁడు వాని వక్షమున్
దీరుగ నుగ్గుఁజేసెనట! ధీరుని కెద్ది యసాధ్యమౌ ధరన్. 79

కృష్ణుని కర్ఘ్యమిచ్చునెడ ★క్రించుఁడునై శిశుపాలుఁడుద్ధతిన్
గృష్ణుఁడకృత్య కర్ముఁడని కేరడముల్ పలుకంగ నత్తఱిన్
జిష్ణుఁడు చక్రఘాతమున జెచ్చెరవాని శిరంబు ద్రుంచ నం
దుష్టపు రక్తముౕ దనర నమ్మలికన్ గొని నీల్గె నాతఁడున్. 80

★క్రించుఁడు : దుష్టుఁడు, నీచుఁడు

సౌభక మన్ విమానమును సాల్వుఁడు మచ్చిక నెక్కిసైన్యమున్
బ్రాభవ లీల వెంటఁగోని ద్వారకపైఁ బడికృష్ణు సైన్యమున్
శోభలడంగఁజేయునెడ శూరుఁడు ధీరుఁడు వ్యోమయానమున్
క్షోభల గూర్చి గూల్చి రిపు గుండెలు పిండిగఁజేసెఁగృష్ణుఁడున్. 81

పాంచాలిన్ సభలోని కీడ్చి రిపులున్ వస్త్రంబులన్ లాగుచో
పంచన్నుండిన పంచపాండవులటన్ వారింప లేకుండినన్,
బ్రాంచద్భూషణ రాజితుండగు హరిన్ బ్రార్థింపఁగాపాడడే,
యెంచన్ భక్త వశంవదుండయి దయాదృగ్వీక్షలేపాఱఁ గన్. 82

మత్తకోకిల:
కౌరవేంద్రుఁడు క్రౌర్యబుద్ధిని కల్గియుండిన వాఁడునై
వారిజాక్షుని లోకనాధుని పట్టి కట్టెడు నయ్యెడన్
శౌరి తానట విశ్వరూపము ఁజాలఁజూపి రహింప ఁగన్
కౌరవాధ్యుఁడు రాజు వేడిన కన్నులన్ గనఁజేయఁడే. 83

మున్ను కుచేలుఁడన్ బరగు భూసుర భక్తుఁడు చాల సంతుచే
నెన్నొ శ్రమంబులన్ బడుచు విప్రసతీమణి ప్రేరణానఁదా
నున్నతి ఁగృష్ణుఁజేరి తనకున్నటుకుల్ ప్రియమార నీయ, నా
పన్నజనార్తిహారి హరి భక్తున కిచ్చె ననూన సంపదల్. 84

దుర్వాసుఁడొకనాడు దుర్యోధనుఁడు ఁబంప
వేలాది శిష్యులు వెంట నడువ
పాండవులున్నట్టి వనభూమి ఁజేరిన
నాహార పాత్ర నన్నంబులేమి
పాంచాలి యోచించి వారిజాక్షు ని వేడఁ
గరుణతో ఁగృష్ణుండు కదలి వచ్చి
పాత్రాన్న శేషమ్ము భక్షించి తనివొంది
శ్రీనాధుఁడేగెను జిత్తమలర,
నంత దుర్వాసుఁడద్దాని నాత్మనెఱిఁగి
తిరిగి రాకుండ రారాజు పురికిఁజేరి
ఘోర శాపంబు నిచ్చెఁదాఁగూర్మిఁద్రోలఁగి
కృష్ణుఁగొల్చిన వారికిఁ గీడు రాదు. 85

నరకునిఁగూల్చి వానికడ నమ్రత నున్న పదారువేల సుం
దరులను బట్టి తెచ్చి హరి, దక్షిణ నాయకుఁడన్ని రూపులై
మరుల నొసంగు మాధవుని మర్మమెఱింగిన నారదుండు త
త్తరమున మ్రొక్కె నీశ్వరుని తత్త్వము భక్తులెఱుంగ కుందురే? 86

పగతుర సైన్యమున్ గనిన పార్థుడు వేగ విషణ్ణ చిత్తుఁడై
మొగమునుడించి మొగ్గరము మూర్ఖుని వృత్తియటంచు నెంచఁగా
నిగమ వినోది పార్థునకు నేర్పున గీతను జెప్పి ధైర్యమున్
మగ టిమిఁగల్గఁజేసి దునుమాడగఁజేసె విరోధి వర్గమున్. 87

యమునన్ గోపిక లెల్ల మున్గునెడ కంజాక్షుండు నవ్వారి వ
స్త్రములన్ దాచిన, వారలంత వలువల్ తామూనఁగా వచ్చిపు
ట్టములన్ గానక విహ్వలాత్ములయి కండ్లన్ బాష్పముల్ రాల్చుచున్
గమలాక్షున్ హరిఁగొల్వ వస్త్రముల వేగన్ వారి కిచ్చెన్ నుతిన్. 88
విశ్వ రూపంబు వీక్షింప వేడ్కనంది
జాంబవంతుఁడు శ్రీకృష్ణు సంస్మరించె,
నంత రుక్మిణీ శుఁడు మహానంద మంది
యట్టి రూపంబు జూపించి యశముఁగాంచె. 89

పౌండ్రక వాసుదేవుడు నపారబలంబును బొంది గర్వియై
తీండ్రిన వేళ సర్వులకు దేవుఁడు తానని ధ్యానమింక చే
యండ్రని చాటఁగా వినిన యంబుజనాభుఁడు చక్రమూని యా
పౌండ్రక వసుదేవుఁబరిమార్చెను మౌనులు నిచ్చమెచ్చఁగన్. 90

ఈ లీలన్ యాదవ కు
లాలంకారులు మరిన్ మహాభ్యుదయమునన్
బాలింపన్ భరతక్షితిని
చాలాకాలము గడచెను చారిత్రముగాన్. 91



రాష్ట్ర కూటుల రాజ్యంబు రాటు(గాంచె,
నా'ధ్రువప్రహారు(డు' సమరాధికుండు
నలరు 'నాసికు' 'ఖాండేషు' లనెడు భూమి
ప్రాంతముల నాక్రమణ(జేసి వాసి(గాంచి. 92

ఘన 'చంద్రాదిత్య'పురం
బును నిర్మించిరి మిగుల భూషిత బుద్ధి
న్ననువగు శుభకాలంబున
దనర(గ నద్దాని రాజధానిగ( బడయన్. 93

ఆతని యనంతరంబున
ఖ్యాతిన్ గొని 'శూర చంద్రు(డును ధీరు(డు సం
ప్రీతిన్ రాజయి పిమ్మట
భూతలమున(గట్టె శోణ పురమను దానిన్ 94

నరపతి సంతతి ధరణీన్
వరలన్ ' సేవిణుల' న(బడి వడసిరి యశమున్
ధరణీ నాధుని నామం
బరుదుగ స్వర్ణాక్షరాల నలరెన్ మిగులన్ 95

అట్టు లేండ్లు గడచె ' ఐదవ భిల్లముం'
డతుల విక్రమాన నతిశయించి
కడలు కొన్నవేళ కల్యాణ చాళుక్య
భూపతుల బలంబు(బొంగు నడ(చె. 96

అంత ' ఐదవ భిల్లముం' డఱసి మురిసి
యాద వాన్వయ స్వాతంత్ర్య మన(గ(దనరు
రాజ్యమచ్చోట నెలకొల్పె, రాణ మీఱ
సర్వ జనులందు సంతోష సౌఖ్య మొదవ. 97

సాహసుండు విభుఁడు చాళుక్య వంశాబ్ధి
సోముఁడనుచుఁగీర్తి ఁజూపుచుండి
దుష్ట భీకరుఁడు చతుర్ధ సోమేశుండు
రాజ్య విస్తృతికి ఁబరాకుఁగోరి. 98

చటుల ధ్వజినీ యుతుఁడు
త్కట బలమునఁ ' కాలచూరి' భూమీశ్వరులన్
గటకటఁగొన నోడించె
న్నట సామంత విభుల నణఁచెన్ మిగులన్. 99

అట్టి యదనులోన ' ఐదవ భిల్లముం'
డెటిఁగి సైన్యమూని తురగమెక్కి
దురముఁజేరి యట ' ' చతుర్ధ సోమేశు' ' నిఁ
గోలఁగొట్టి, దాగుకొనియెనంత. 100

వే కల్యాణిఁగ్రహించి నెమ్మదిని ప్రావీణ్యంబుఁబెంపారఁగన్
వీకన్నాహొయసాల భూవిభుఁడునౌ భల్లాలు నోడించియ
స్తోకా పేక్షను జోళరాజగు ' కులోత్తుంగున్ దగన్గెల్చిసు
శ్రీకిన్ మూలమటంచు ఁగైకొనె పురిన్ శ్రీరంగమున్ శ్రేయమై 101

రెండవ 'భల్లాలుఁడు' వెస
మెండగు సైన్యంబు వలన మేటిగ ననిలో
దండిఁబడి యాభిల్లమునిన్
దండిన్ గొని యోడఁజేసెఁదహతహ దీరన్. 102

ఆ జననాధుని తదుపరి
రాజిలు యదురాజ్యమేల రాయసమొప్పన్
తేజోద్ధాముఁడు 'జైతురి'
రాజుగ నేతెంచె, ధర్మరాజను కీర్తిన్ 103

ఆ రాజేంద్రుని పిమ్మట
శ్రీరాజిలె నతని సుతుఁడు 'సింఘన' రాజై
పేరుఁగొని హోయసాలుల
ఘోరముగా నాజిఁగెల్చి కొనె బళ్ళారిన్ 104

నరపతి 'గణపతి దేవుని'
దురమునకున్ జీరపోరి తొందర వలనన్
బరగెడి 'గుజరాత్', నలమిన్
ద్వరగా, గెలువంగ సాధ్యపడలేదతనికిన్. 105

సురసంప్రీతుఁడు చాందదేవుఁడు ధరన్ జ్యోతిష్కుఁడై ప్రీతితో
ధరణీ నాధుని సింఘనాహ్వాయుని యాస్థానంబునన్ వెల్గుచున్
సరగన్ జ్యోతిష శాస్త్రబోధన కళాశాలందు స్థాపించి సు
స్థిర సత్కీర్తినిఁగాంచి మించె మహిమన్ జెల్వారు చిత్తంబునన్. 106

సింఘన మనుమఁడు పిదపన్
సంఘంబునఁ 'గృష్ణు' ఁడనగ సాహస ధనుఁడై
సంఘర్షణలన్ గెల్చియు
సంఘీ భావంబు వలన క్ష్మాపతి యయ్యెన్. 107

గుణగణ మణియగు కృష్ణుఁడు
గణుతిన్ గొనెఁబ్రజలలోన గమనార్హుండై
గణపతి దేవున కెట్లో
గణగున రాజ్యంబుఁగొంతఁగైవస పరచెన్. 108

తీరక సమయము లందున
సారస్వత సభలు జరిపి సంతుష్టుండై
సారస్వత పోషకుఁడని
ధారుణిలో ఁగృష్ణుఁడలరి ధన్యతఁగాంచెన్. 109

నుతిఁగొన బ్విలణుఁడనఁబడు
మతిమంతుఁడు మంత్రిఁగాఁగ క్ష్మాపతి యెలమిన్
గ్రతువులనేకముఁజేసియు
వితరణఖని యంచు వెలసె విశ్వములోనన్. 110





వాదనలెఱుఁగని కృష్ణుఁడు
సాదరమున రాజ్యమేలి శాంతినిఁబొందన్
జోదనెడు మహాదేవుఁడు
యాదవ రాజ్యాభిషిక్తుఁడయ్యెన్ బ్రీతిన్ 111

కృష్ణుని తమ్ముండీతఁడు
విష్ణుని సేవించుచుండి విస్తృత లీలన్
తృష్ణనల కాకతీయుల
నుష్ణీశముఁబొంద వైర మూనెను మిగులన్. 112

హేమాద్రి మంత్రికాగన్
హేమాద్రిన్ గెల్వఁజాలు హేవాకముతో
భూమీశ మహాదేవుఁడు
ధీమాన్యుండయ్యెఁజాలదీప్తిని ఁబడసెన్. 113

అంగదఁగొన్న కేసరి యహంకృతి ఁదంతిని దాకుమాడ్కి వే
సంగర మందుదూరి హొయసాల విభున్ నరసింహుఁగూల్చి తాఁ
బొంగుచు మేటి శౌర్యమును బూనియు హేతి విశాలదేవునిన్
లొంగెడి రీతిఁజేసి మదిలోపల హెచ్చిన ధైర్యసంపదన్. 114

రుద్రమ్మ తెలంగాణన్
భద్రమ్ముగ నేలువేళ వైళమ యనిలో
రుద్రుని వలె యదురాజా
రుద్రమ్మను నొంచి గెల్చె రోష మెసంగన్ 115

ఆ మహాదేవుఁడు మరణ మంది నంత
నతని పుత్రుండు 'అమ్మన' నమరు కృష్ణ
సుతుఁడు 'రామ చంద్రుండ'ను సుషుమ చరుల
మధ్య సింహాసనాపేక్ష మందలించె. 116

ఒఱగు వారసత్వ యుద్ధాన వారలు
పోరి పోరి యలసిపోయి రంత
రామచంద్రవిభుఁడు ప్రావీణ్యమునఁగెల్చి
రాజ్యరమను బొంది రమణఁగాంచె. 117

'అల్లా ఉద్దీన్ ఖిల్జీ'
యల్లటఁబెట్టంగ దాడి నాధిక్యతతో
నల్లరిని దేవ గిరిపై
నల్లన సాగించి ధనములప్పుట దోచెన్. 118

ఆ ముస్లిందాడులు వే
భీమాకృతిఁదాల్చె ఁదాన వేటిమిఁగలుగన్
భూమిన్ యాదవ రాజ్య
శ్రీ మహిమఁదఱుఁగఁదొడంగె, జెడె ధర్మమ్ముల్. 119

'కర్ణదేవుఁడు' గుజరాతు గాచుకొఱకు
రామచంద్రుని సాయంబు ప్రఖ్యఁగోర
యాదవేంద్రుండొడంబడె నాదరమున
దాని'మాలికపూర్'విని తక్షణంబ. 120

ఘనత వలన 'మాలిక్ కపూర్'అనుశయమున(1)
దేవగిరిపైన దండెత్తి దీక్షఁబూని
రామ చంద్రుని నెదరించి రణముఁజేసి
ఓడఁజేసిన నాతఁడు నొంజి లూని. (2) 121

తరువాత రామచంద్రుఁడు
సరగున ఖిల్జీకిఁదాను సామంతుండై
ధరణీ పాలన ఁజేయుచుఁ
బరువును విడనాడి మెలఁగె బహురీతులతో 122

శంకర దేవుఁడు తదుపరి
శంకించక రాజునయ్యె, సాహస ధనుఁడై
బంకంబున స్వాతంత్ర్యము
నంకిలి ఁబడకుండఁజాటె నంజును (3) గొనఁగన్. 123

1. అనుశయము = అనుబంధము
2. ఒంజిలి = దుఃఖము
3. అంజు = భయము

ఎరిగిన' మాలి కపూర్' కడు
సరగున దండెత్తి వచ్చి శంకర దేవున్
బరుసంబుగ దును మాడెను
ధరణిన్ బ్రజలెల్లఁగాంచి తల్లడ మందన్. 124

కినుకన్ యాదవ రాజ్యమంతటిని యాఖిల్జీప్రభూ రాజ్యమం
దునఁజేర్పించెను మాలికాఫరుఁడు, నా దుర్వార మాత్సర్యనిఁ
యనిలో మార్కొను వారు లేక యదురాజ్యంబంతమై పోవుచిం
తనయే యాదవులందు నిండినది, యే తాహత్తు లేకుండుటన్. 125

జైన, బౌద్ధమతము లందు జగతిలోన
మతసహన సిద్ధి వెలయ సన్మాన్యులగుచు
వేద విజ్ఞాన శాస్త్ర వివేకవంతు
లై భరతమాతకు సుతులైరి విభులు. 126

కలిమిన్ యాదవ వంశ శేఖరులు నా కల్యాణ చాళుక్యరా
జుల సత్పద్ధతులన్ గ్రహించి, కడు సుశ్లోకంబునన్ మంత్రి మం
డలి నేర్పాటొనరించి, రంత వ్యవసాయార్థా ంక విఖ్యాత శా
ఖల నా మంత్రుల కిచ్చి తోడుఁగొని వీఁకన్ రాజ్యమున్నేలఁగఁ. 127

ఎన్ని బిరుదంబు లున్ననుఁదృప్తి ఁగొనక
రాజులల మహారాజాధిరాజ బిరుదు
లూని సార్వభౌమత్వము లుర్విలోనఁ
బ్రకటితమ్ముగ నొనరించి వాసిఁగొనిరి. 128

మాతృభాష మరాఠిగా మహిమఁగాంచె
వ్రాయఁబడె శాసనమ్ములాభాషలోన,
క్రతువులందున నాశక్తి కరగు చుండె,
బౌద్ధ జైన మతంబుల ప్రభలుఁదరిగె. 129

గరుడ లాంఛనాల (గ్రాలెడు నాణ్యాలు
యాదవేంద్రులెల్ల నవనిలోన
విష్ణు భక్తులంచు వివరింప నొప్పదె?
యన్య ఋజువులేల? యవియె చాలు. 130

శ్రీవిష్ణ్వవతరణమను
రేవ వినోభాసు నెంచి రీవిన్ బ్రజలున్
మేవడి పూజలు సలుపన్
విభవానందులైరి దివ్యచరిత్రన్. 131

భక్తి మతము వలన వర్ణభేదంబులు
నచటి వర్గ కక్షలంత మొంది,
జనుల లోన వరలె సర్వ సౌభ్రాతృత్వ
మహిమ సమత నైకమత్యబలము. 132

వ్యవసాయమ్ము విదేశ వర్తకములున్ వాసిన్ బ్రదర్శించుట
న్నవలీలన్ సుఖ సంపదల్ ప్రబలె నక్రాతంబు నయ్యార్థి కా
యవధిన్ జిక్కిన పద్మటంకములు హేమాకార నాణ్యంబులున్
స్తవనీయంబుగ (జాటు భాగ్యముల నానాజ్యోతులై వెల్గ(గన్. 133

అగ్రహారాలు దేవాలయాలు నాడు
నలరు వైదిక విద్యల నెలమి బోధ
నంబు గావించు కేంద్రంబులగుట వలన
వేద విద్యలు వెలసెను విప్రులందు. 134

అమరన్ 'ముకుందరాయుం'
డు మరాఠీ భాషలోగడున్ ఘనుఁడై యుం
డి మహిని నాది కవిగ వ్రా
సె మృదుమధురముగ 'వివేక సింధు' రచనమున్. 135

అలరు ' హేమాద్రి' సంస్కృతమందపూర్వ
మనఁ ' జతుర్వర్గ చింతామణి' ని మనోజ్ఞ
మైన ' దాన కావ్యావళిన్ మానితముగ
వ్రాసి యాదవేంద్రుల గౌరవంబుఁజాటె. 136

' జ్ఞాన దేవు' ఁడెలమి ' జ్ఞానేశ్వరి' యను
గ్రంథ మొకటి వ్రాసి ఘనత నొందె,
భక్త గణములెల్ల భక్తి గీతంబుల
మాతృభాషలోనఁ బాడుచుంద్రు! 137

భాస్కరా చార్యుఁడార్యుఁడు ప్రముఖ గణిత
శాస్త్రవేత్తయై రాజులు సన్నుతింపఁ,
దాను [1]'సారంగ దేవుఁడు' ధరణిలోన
వ్రాసె' సంగీత రత్నాకరంబు' నొకటి! 138

విద్యల నాదరించిరి ప్రవీణుల మాన్యుల శారదార్చనన్
సద్యశమందఁబోషణము ఁజక్కగఁజేసిరి, భక్తి భావమం
దుద్యమ ముద్ధరించిరి, మహోన్నత దానకళాభిమానులై,
యాద్యులునై విరాజిలు ప్రజారదణీయులు యాదవేశ్వరుల్. 139

పాడిపంట సమృద్ధిగా ఁగూడి యుండ
సంకటంబులు లేకను సౌఖ్యమంది,
దేవతార్చన లందును దృష్టిఁజూపి
ప్రజలు వరలిరి భువిలోన భద్ర విధుల! 140

★★★

ధరలోనన్ నృపకాముఁడు
ధరణీ ధరున కెనయైన ధైర్యము వలనన్
సరియైన 'సోసవీరే'
'కరుజౌనని' రాజధానిగన్ దాఁబడసెన్ 141

1. 'శార్ఙ్గ' శబ్దమే ' సారంగ' శబ్దముగా మార్పునొందినది.
ఉదా :- శార్ఙ్గ పాణి : సారంగపాణి

యాదవ వంశోద్భవుఁడై
యాదరమున హోయసాలులందాది నృపుం
డై దయతో నా పేరున
మేదిని రాజ్యంబు నిలిపె మీరిన శక్తిన్. 142

వినయాదిత్యుఁడు నా నృపుఁ
దనయుండై ఖ్యాతిఁగాంచి తదుపరి యతఁడే
జనపాలుండయి రాజ్యం
బును విస్తరణంబుఁజేయఁబూనిన బుద్ధిన్. 143

సంగర రంగమందు గడుసన్ వడి చోళవిభుండు నొ,కులో
త్తుంగుని గెల్చి నిల్చి, కడు దుష్టులు నైన యనేకరాజులన్
గ్రుంగఁగఁజేసి లోగొనెను కొంకణ, సానిమలై తళక్కరుల్
పొంగెడి వారిహద్దుగల భూములఁబొందె యశోధికుండుగాన్. 144

ఆ విభుండు మరణ మందిన పిమ్మట
విష్ణువర్ధ నుండు వీరవరుఁడు
హోయసాల విభుల 1 హూతిని మన్నించి
రాజ్యభారమూనె రాజువోలె. 145

కన నారాతి నికృంతన క్రియకళాకౌశల్యధుర్యుండు,ల
క్షణ సంపన్నుఁడు, సర్వ వాఙ్మయ కళాసారాంశసాహిత్య స
ద్వినియోగాభిరతుండు, దానసుగుణా విఖ్యాత విజ్ఞుండునై,
మనుజాధీశుఁడు విష్ణువర్ధనుఁడిలన్ మాన్యుండునై వెల్గు చున్. 146

వెసఁదలకాఁడు, బనవాసి, వీరగంగ
విజయనోలంబ, నాఁబడు బిరుదులంది
సర్వసామంత రాజులు సంతసింప,
విభుఁడు భువిలోన వెలసెను విధువు' వోలె. 147

హూతి = పిలుపు

'పాండ్య' 'చోళ' 'గాంగ' 'కదంబ' వసుమతీశు
లను జయించి, యజేయుఁడై వినుతిఁ బడసి
రాజ్య విస్తృతిఁగావించెఁగ్రాంతి మీర
నఖిల శాసనావళి తెల్పు నచ్చటచట! 148

ఘన రాజేంద్రుని జైత్రయాత్రలకు నాకల్యాణ చాళుక్యులే
యనుమానించి భయంబుఁజెందిరి కదా, యానాడు యోచింపఁగన్
జననాథున్ యదు రాణ్మణిన్ రణమునన్ సామాన్యమే గెల్వఁగన్?
గనఁగాదానిని శాసనంబుదెలిపెన్ గౌతుహలం బొప్పఁగన్. 149

ఆ యవనినాథుఁడేగ ద్వితీయుఁడనెడు
వీర భల్లాలుఁ డు బలము వెలయురీతి
హోయసాల విభుండయి యుర్విలోన
రాజ్య చక్రంబుఁ ద్రిప్పుచు రాణఁగాంచి. 150

వీరాధి వీర బిరుదము
ధారుణిలో ఁదానుదాల్చి ధైర్యోద్ధరుఁడై
వీరుని భల్లమ దేవుని
తీరుగ ననిలోన గెల్చె దివ్యులు పొగడన్ 151

హొయసాల రాజ్య మున్నతి ఁగాంచుటఁ
గనిన చోళవిభుఁడు తనివిఁజెంది
వెలయు తనదు సుతను వీరభల్లాలుని
కొసఁగి పెండ్లిఁజేసె నుల్లమలర 152

ఆ రాజు సహాయమ్మున
వైరులుగా నున్న పాండ్యవసుధాధిపులన్
వీరులు చోళులు గెల్చిరి;
ధారుణిఁదమరాజ్యమెల్లఁదనరఁగనంతన్. 153

అదుపగు రాజ్యము కృష్ణా
నది వరకున్ వ్యాప్తిఁజెంద నరనాథులలో
నదవద గలిగించుచు సం
పదలన్ దనరాజ్యమందు ఁబన్నుగఁబంచెన్! 154

ఇరువది వత్సరములలోఁ
బరగన్ బలమూని వీరభల్లాలుఁడుచె
చ్చెరఁదా కదంబ యాదవు
ల రణమున జయించి యలరె రాజ్యాకాంక్షన్! 155

హొయసాల రాజ్య మునకు హొయలు మీరఁ
దా స్వతంత్ర రాజుననఁగ ధరణిఁ జాటె
నతుల సార్వభౌమత్వ చిహ్నంబు నెఱపఁ
జెల్లె; ప్రారంభమదియయ్యె 'భల్ల' శకము! 156

భండన భీముండనఁబడి
రెండవ నరసింహుఁడాయెతేడుగ, పిదపన్
దండనఁగల యాదవులున్
గండరులై దండయాత్ర గావించు తరిన్! 157

అపుడు పాండ్యులు చోళ రాజ్యంబు మీద
దండ యాత్రను గావించి, గండు మిగిలి
ఘనుని మూడవ రాజరాజును జయించి,
వేగ బంధింప నరసింహ విభుఁడు పిదప! 158

మంగళ వాద్యనాదము లమందగతిస్ జెలువొంద, మత్తమా
తంగ తురంగ సద్భట వితానము రా, హొయసాలనాథుఁడున్
సంగర రంగ మందు పటు శౌర్యుల పాండ్యుల వాహినుల్ వడిన్
గ్రుంగగ హస్తి వాజి భట రూపములన్ విదళించి గెల్వఁగన్! 159

సాగు చోళ రాజ్యప్రతిష్ఠాపనమునఁ
దానె యాచార్యుఁడనబడి పూనెఁగీర్తి
నతిని పాలన మందున నఖిల జనులు
పాడి పంటల వృద్ధులన్ బరగి రెలమి! 160

ఆ మనుజేశుని తదుపరి
'సోమేశుఁడు' విభుడునయ్యెఁ జోళుల కొరకై
ధీమహిమన్ బాంధ్యులతో
వే మోహరమును నడిపెఁ బ్రవీణుఁడు తానై! 161

ఉన్నరాజధాని 'కన్నలూరు' న ఁగట్టి
'విక్ర పురమటంచు ఁజేరుఁబెట్టి,
యంత్య కాలమందు నమరిన రాజ్యమ్ము
సుతుల కొసఁగి విభుఁడు సుఖములందె! 162

మూడవ 'నరసింహ' భూపతి ద్వార స
ముద్రమున వసించి, పుడమి నేలె ;
'రామ నాధు' ఁడెలమి రాజ్యమ్ముఁబాలించె
కన్న లూరునుండి ఘనత మీర! 163

రామనాధుని భువిఁబాండ్యరాణ్మణియయి
వరలు' సూరవర్మ 'గులశేఖరుఁడు యుద్ధ
మందు నోడించి తమిళ నాడందు వెలయు
రాజ్యభాగంబు గడియించి ప్రతిభఁగాంచె! 164

మూడవ 'భల్లాలుఁడు' నా
మూడవ నరసింహు సుతుఁడు భూషిత బుద్ధిన్
జేడయె వారల తదుపరి
వేడుకగాఁదాను రాజ్యవిస్తృతి ఁగోరెన్. 165

మగటిమి 'బనవాసి' ని పే
రుగ 'సొంతలిగే 'విలువ పెరుగ ఁకోగలి ఁనిన్
'మ్రుగ్రై తొండైనాడుల'ఁ
బొగడన్ యదురాజు గెల్చె భుజబల శక్తిన్. 166

అలర నా' తిరుణ్ణామ లై ని, చెల'ఁగు
చున్న 'కాంచీపురంబును శోభమీర
తనదు రాజ్యాల విలువ ఁదనరఁజాటి
రాజధానుల గావించెఁ బ్రజలుఁబొగడ! 167

ఆ నరపాలుని పాలన
మానుగఁగీర్తింపఁబడియె మాన్యుల చేతన్
య్యైన నది ముస్లిం దాడుల
లోనఁబడిన, నృపుఁడు వేగలొంగక పోరన్ ! 168

'అల్లా ఉద్దీన్ ఖిల్జీ'
భల్లాలుని గెల్వుమను చుఁబన్నుగడలతో
నల్లకము నల్లి యంతట
నల్లన'మాలిక్ కపూరు' నంపెన్ జెడుగై ! 169

భల్లాలుని సైన్యంబును
మెల్లఁగ మాలీకపూరమిత్రత బుద్ధిన్,
బెల్లుబికెడు వాహిని తో
దల్లడ మొనరించి గెల్చెఁదదుపరి విభుఁడున్ ! 170

విధియని తలంచి 'ఖిల్జీ'
యధికార విధులకులొంగి 1 యరి కట్టుచుఁదా
వ్యధఁజెందుచు నుండెను; గన
విధి వక్రించిన జయమ్ము వీరునకగునే ! 171

1 అరి = కప్పము

హోయసాలరాజ్య ముర్వీతలంబున
మలుఁగు తరుణమెల్లఁగలిగె ననగ,
మగుడ యదువిభుండు మధుర సుల్తానుల
తోడ నాజిఁజేసి తొలఁగె తనువు! 172

అంత నాల్గవ 'భల్లాలు'ఁ డమితనుతుఁడు
హోయసాల రాజ్యేశుఁడై యొప్పెఁగాని,
ముస్లిముల దండయాత్రల 1బోము వలన
ఏక వర్షాన నారాజ్య మెఱుక ఁబాసె! 173

హోయసాల రాజేంద్రులు హొయలు మీర
ప్రథిత కల్యాణ చాళుక్యరాజవరుల
రాజ్యపద్ధతులన్ దమరాజ్యమందు
ననుసరించిరి, బహుళ విఖ్యాతిఁగనిరి! 174

జైన మతమున నున్న భూజానులెల్ల
నెలమి 'రామానుజాచార్యుని' ఘన బోధ
వలన వైష్ణవ మతమూని వాసిఁగనిరి,
కాన నామత మచ్చోటఁగ్రమ్మె మిగుల 175

'కాలచూరి' విప్లవము ప్రఖ్యాతి నొంద
సౌమ్య 'బసవేశ్వరు'ని వీర శైవమతము
ప్రబలి కర్ణాటకన్ జాల వ్యాప్తి ఁగాంచె,
నైన నయ్యది చిరకాల మమర లేదు ! 176

ప్రీతిని మధ్వాచార్యులు
ద్వైత మతము లోని భక్తి తత్త్వముఁజాటన్,
నీతిగ విని హొయసాలులు
భూతలమున నాచరించి మోదము గొనరే ! 177

1. బోము : బలాత్కారము

ఘన 'సోమనాధపురము'న
దనరన్ 'బేలూరు' నందు ద్వారసముద్రం
బున నాలయముల గట్టిరి
యనువుగ నా హోయసాల యవనీ నాధుల్ ! 178

ఈ హన్ సంస్కృత కన్నడ
సాహిత్యములఁగృషి సల్పిజైన కవుల సం
దోహము వలనన్ రచనల
నూహన్ వ్రాయించి రెలమి హోయసాల నృపుల్ ! 179

మతము లెన్ని యున్న మహిలోనఁబరమత
సహన మనెడు మహిమ చక్రవర్తు
లందువెలయ, నార్యులకార్కరణంబునఁ
జాలఁబొగడినారు సంతసమున ! 180

వాస్తు శిల్పకళల వాసి నిఁబడసిరి,
కవుల కలము లందు ఘనత గొనిరి,
యట్టి విభుల కీర్తి యాకాశ దేశాన
తారలున్న దనుక తనరు చుండు ! 181

విష్ణుండు కృష్ణుఁడై విశ్వజనీనుఁడై
యవతరించెను యదువంశమందు,
కదన భీకరుఁడైన కాటమ క్ష్మాపతి
భవముఁగాంచెను యదువంశ మందు,
పలనాటి సీమలో నల బాలచంద్రుఁడు
ప్రభవ మందెను యదువంశ మందు,
ధీరుఁడు శ్రీకృష్ణ దేవరాయలు పుట్టె
ప్రతిభ గాంచిన యదువంశమందు,
తే:గీ, కవుల, సంగీత వేత్తలు, జ్ఞాన ధనులు,
సత్య వచనులు, మాన్యులు, శాంతి మతులు
న్యాయ కోవిదులు, ప్రౌఢులు, త్యాగ గుణులు
వాసిగా జనించిరి, యదువంశమందు ! 182

యాదవ చక్రవర్తుల మహామహితాత్మక గాథలెన్నియో
మేదిని జాల వెల్గెడిని ; మేలని కొన్నిరచించి మిమ్ములన్
మోదమునన్ బరింపుడని ముద్దుగఁ జెప్పితి ; నట్లుసేయదా
మోదరుఁడిచ్చు మీకిల నమూల్యసుఖంబుల భోగభాగ్యముల్ ! 183

## ఆకాంక్ష

## భరతవాక్యము

విద్యాభివృద్ధికై విరివిగా (గృషిఁజేసి
విజ్ఞాన మందున వెలయ వలయు
మహనీయ చరితల మనముల నిడుకొని
జాతివైభవ మిలఁజాట వలయు
చెడు పద్ధతులనెల్ల వడివడి విడనాడి
ఉత్తమ మార్గాల నుండవలయు
రాజకీయకములందు ప్రగతిని సాధించి
ఉన్నత పదవుల నొందవలయు

ఐకమత్యబలంబున నలర వలయు
మేలి క్రమశిక్షణను బొంది మెలగవలయు
దివ్య గుణముల వృద్ధి సాధింప వలయు
నన్ని రంగాల నభివృద్ధి నందవలయు ! 184

## శివ స్తోత్రాష్టకము

పురహర! శుభకర! శంకర!
కరుణాకర! నాగహార! కల్మషదూరా!
పరమానంద విహారా!
పరమేశ్వర! బ్రోవుమయ్య! ప్రార్థింతు శివా! 1

భావజ సంహారా! హర!
పావన లోకోపకార! భక్తోద్ధారా!
దేవా! దైత్యవిదారా!
బ్రోవుము విజయప్రచార! భూషింతు శివా! 2

గిరిజారమణా! ఉరగా
భరణా!పాండిత్య నిపుణ! భవభయ హరణా
సురగణ పోషణ! ధిషణా!
వరసంగీతప్రవీణ! వందనము శివా! 3

గిరివాసా! గౌరీశా!
దరహాసా! భవవినాశ! ధర్మవికాసా!
పరమౌదార్యవిలాసా!
పరమేశా! స్వయంప్రకాశ! వందనము శివా! 4

సనక సనందన సన్నుత!
యనుపమ కారుణ్య భరిత! ఆశ్రిత వినుతా!
తనర శశాంక సుశోభిత!
అనిమిష గంధర్వ సహిత! అర్చింతు శివా! 5

త్రిపురాసుర సంహారా!
విపుల దయోత్సవ విహార!వేదోద్ధారా!
యపరిమితానందకరా!
రిపుగణ రణరంగ భీమ! శ్రితవంద్య! శివా! 6

నిటలాక్షా! శ్రితరక్షా!
నటనా నైపుణ్య దక్ష! నాగాధ్యక్షా!
ఝటిల విజృంభిత రాక్షస
ఘటనా విఘటిత నిరీక్ష! కాపాడు శివా! 7

శంకర! భక్త వశంకర!
సంకట హర! సత్యధుర్య! జగదాధారా!
ఓంకార! వినోదకరా!
పొంకముగా బ్రోవుమయ్య! పూజింతు శివా! 8

## శ్రీ శివ పంచాక్షరీ స్తోత్రము

శ్రీ దేవదేవాయ! త్రిలోచనాయ!
నాగేంద్రహారాయ! దిగంబరాయ!
మౌనీంద్ర వర్ణాయ! మహేశ్వరాయ!
తస్మై 'న' కారాయ నమశ్శివాయ! 1

శ్రీనీలకంఠాయ! ప్రియంవదాయ!
ఆకాశకేశాయ! జయప్రదాయ!
శ్రీశైలవాసాయ! గిరీశ్వరాయ!
తస్మై 'మ' కారకాయ! నమశ్శివాయ! 2

శ్రీవిశ్వనాథాయ! గణేశ్వరాయ!
శ్రీవాయులింగాయ! యతీశ్వరాయ!
ఆపన్న రక్షాయ! శుభంకరాయ!
తస్మై శికారాయ! నమశ్శివాయ! 3

శ్రీ సోమనాథాయ! జటాధరాయ!
చందన మందార సమార్చితాయ!
శ్రీచంద్ర చూడాయ! సనాతనాయ!
తస్మై 'వ'కారాయ! నమశ్శివాయ! 4

శ్రీ పార్వతీశాయ! పరాత్పరాయ!
పాపౌఘనాశాయ! సుఖప్రదాయ!
దైత్య వినాశాయ! సతీశ్వరాయ
తస్మై 'య'కారాయ! నమశ్శివాయ!

## గద్యము

**శ్రీ కొమర్ల గోత్ర పవిత్ర నాగయపౌత గోపాలయ ప్రథమపుత్ర**

**శ్రీ గుండాల కోనేశ్వర కరుణాకటాక్ష లబ్ధ కవితావిచక్షణ**

బొడ్డు బోయిన వేంకటనారాయణ ప్రణీతంబైన
గోకులాభ్యుదయంబను ప్రబంధంబున
తృతీయాశ్వాసము
సర్వము సంపూర్ణము.
శ్రీశ్రీశ్రీ

# అనుబంధము

చంద్రకళ -ర స స త జ జ గ - గణములు 11 అక్షరం యతి

వసంత తిలకము - త భ జ జ గ గ - గణములు 8 అక్షరం యతి

ధ్రువకోకిల - న భ ర స జ జ గ - గణములు 12 అక్షరం యతి

భుజంగ ప్రయాతము - య య య య - గణములు 8 అక్షరం యతి

సుగంధి - 7 హ గణాలు 1 గురువు 9 అక్షరం యతి

స్రగ్విణి - ర ర ర ర - గణములు 7 అక్షరం యతి

అంబురుహము - భ భ భ భ భ ర స వ - గణములు 13 అక్షరం యతి. అని అనంతుని ఛందస్సు 12 యతి అని కావ్యాలంకార చూడామణి

మాలిని - న న మ య య - గణములు 8 అక్షరం యతి. 9 అని అప్పకవీయం

ఉత్సాహ - 7 సూర్య గణములు 7 గణం తొలి అక్షరం యతి కడపట గురువు.

సుందరము - భ భ ర స ల గ - గణములు 9 అక్షరం యతి

కవి కంఠ భూషణము - స జ స స స జ గ - గణములు 9 అక్షరం యతి

పంచ చామరము - జ ర జ ర జ గ - గణములు 9 - 10 అక్షరం యతి

సింహరేఖ - ర జ గ గ - గణములు యతి లేదు. ప్రాస ఉంది.

చంద్రవర్త్మ - ర జ భ స - గణములు 7 అక్షరం యతి

సమాని - ర జ వ - గణములు యతి లేదు ప్రాస ఉంది.

మంజుభాషిణి - స జ స జ గ - గణములు 8 - 9 అక్షరం యతి

స్వాగతము - ర న భ గ గ - గణములు 7 అక్షరం యతి

పృథ్వి - జ స జ స య వ - గణములు 12 అక్షరం యతి

పద్మకము - న భ జ జ జ గ - గణములు 11 అక్షరం యతి

కవిరాజ విరాజితము - న జ జ జ జ జ జ వ - గణములు 8 -14 - 20 అక్షరాలు యతి.

మత్తకోకిల - ర స జ జ భ ర - గణములు 11 అక్షరం యతి

తావకము (పాదపము) - భ భ భ గ గ - గణములు 7 అక్షరం యతి

మంజరీ ద్విపద - 3 ఇంద్ర గణాలు ఒక సూర్యగణం - 3వ గణం తొలి అక్షరం యతి ప్రాసలేదు. రెండేసి పాదాలు.

మల్లిక - భ భ త ల గ - గణములు 7 అక్షరం యతి

విమానము - జ త గ గ - గణములు యతిలేదు. ప్రాస ఉంది.

కమల విలసితము - న న న న గ గ - గణములు 9 అక్షరం యతి

పద్మనాభము - త త త త త త త గ గ - గణములు 13 అక్షరం యతి

క్రౌంచ పదము - భ మ స భ న న న య - గణములు 11 - 18 అక్షరం యతి అని కావ్యాలంకార చూడామణి 10 - 19 అక్షరం యతి అని అప్పకవీయం

మందాక్రాంతము - మ భ న త త గ గ - 11 అక్షరం యతి.

# గోకులాభ్యుదయము



**దంపతులు**

**శ్రీ బొడ్డుబోయిన వేంకటనారాయణ**, బి.ఎ.బి.ఇడి.,

జననం : **1-7-1938**

**సౌభాగ్యవతి శ్రీమతి రామసుబ్బమ్మ**

జననం : **25-5-1945**

కీర్తి ఆఫ్‌సెట్, తిరుపతి. ఫోన్ : 29344